శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః



శ్రీ వేదాంత దేశికులు అనుగ్రహించిన

# సంప్రదాయపరిశుద్ధి

(ఆంధ్రానువాదము)




**అనువాదకులు:**

పండితరత్న, ఉ.వే.శ్రీమాన్
ఈయుణ్ణి అళహ శింగరాచార్య స్వామి వారు

**సంపాదకుడు:**

ఈయుణ్ణి అనంత రంగ రామన్

# హార్దనివేదనం

**వేదాంతదేశికః శ్రీమాన్**
**వేదాంతద్వయకేసరీ,**
**జయతాజ్జయతాన్నిత్యం**
**జయతాజ్జయతాత్తరామ్.**

**సద్గ్రంథోఽయం సంప్రదాయ**
**పరిశుద్ధిః సమర్ప్యతే,**
**ఆంధ్రానువాదరూపేణ**
**సంప్రదాయవిదాం ముదే.**

శ్రీవైష్ణవసంప్రదాయానికి చెందిన ఆచార్యపరంపరలో దేశికులు విలక్షణమైన స్థానాన్ని అలంకరిస్తున్నారు. శతాధిక గ్రంథకర్త అయిన వీరు సంస్కృత, ద్రావిడ ప్రాకృత మణిప్రవాళ భాషలలో సాటిలేని గ్రంథాలను రచించారు. వీరు రచించని ప్రక్రియ కానీ, రచించి సఫలం కానీ ప్రక్రియ కాని ఏదీ లేదు అనేది వాస్తవం. చాలా ప్రౌఢమైన, మనోహరమైన కవిత్వాన్ని రచించడంలో వీరు సిద్ధహస్తులు.

దేశికులు 32 రహస్య గ్రంథాలను రచించారు. ఇవి అన్నీ శ్రీ వైష్ణవ సంప్రదాయంలోని ముఖ్యమైన విషయాలను తెలుపుతున్నాయి. వాటిలో **'సంప్రదాయ పరిశుద్ధి'** అనే గ్రంథం మొదటిది. ఇందులో శ్రీ వైష్ణవ సంప్రదాయానికి సంబంధించిన, తప్పక తెలుసుకోవలసిన అంశాలను చాలా చక్కని శాస్త్రీయమైన రీతిలో తెలియ పరచారు. భగవానుని నుండి ఆరంభమై ఈ నాటి వరకు కొనసాగుతున్న మన సంప్రదాయం చాలా పవిత్రమైనది, ఏ విధమైన దోషం లేనిది–అనే అంశం ఇందులో వివరింపబడింది. అందువల్ల దీనికి ఈ పేరు వచ్చింది–అని పెద్దల వచనం. ఈ

గ్రంథం కేవలం ద్రావిడ భాష లోనే ఉన్నందున, తెలుగులో అనువదించి ఆంధ్రదేశంలోని సంప్రదాయ సహృదయ పాఠకులకు సమర్పించాలని ఆశతో ఈ అనువాద ప్రయత్నం చేయబడింది. దేశికసూక్తి సంస్కృత ప్రమాణాలతో నిండి చాలా జటిలంగా ఉంటుంది. అందువల్ల ఈ గ్రంథంలోని తాత్పర్యం దేశికుల సూక్తిని అనుసరించి వివరింపబడుతున్నది. ఈ గ్రంథంలో కనిపించే సంప్రదాయ భేదాలను సహృదయులైన పాఠకులు గ్రంధకర్త చెందిన అభిప్రాయాలుగా గమనించాలి. మహాచార్యులైన పెద్దల అమూల్యాలైన అభిప్రాయాలను మనం తెలిసి ఆనందించడానికి ఉపయోగపడుతుంది అనే ఉద్దేశంతో ఈ అనువాద ప్రయత్నం చేయబడినది.

**వాచస్పతి డా. ఉ.వే. శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యస్వామివారు** దేశిక సాహిత్యంపై చక్కని పట్టును, అంతులేని అభినివేశాన్ని కలవారు. వీరు రచించిన పాదుకా సహస్రం వ్యాఖ్యానం, యతిరాజ సప్తతి, యాదవాభ్యుదయం మొదలైన దేశిక గ్రంథాలకు రచించిన వ్యాఖ్యానాలు సంప్రదాయ సాహిత్య పాఠకలోకానికి సుపరిచితాలు. దేశిక సాహిత్యం అనగానే శ్రీ రాఘవాచార్యులవారి పేరు తప్పక గుర్తుకు వస్తుంది. వీరు 'నృసింహ ప్రియ' అనే అహోబిల మఠానికి చెందిన తెలుగు మాసపత్రికను ఉపసంపాదకులుగా నిర్వహించే సమయంలో ఈ సంప్రదాయ పరిశుద్ధి గ్రంథానువాదం ఆ పత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడింది. అది ఇప్పుడు గ్రంథరూపంగా కూర్చి సిద్ధం చేయబడింది.

శ్రీమాన్ రాఘవాచార్యస్వామివారికి నా విషయంలో చాలా అభిమానం; నా కృషిని వారు ఎల్లప్పుడు ప్రోత్సహించేవారు. వారి సంస్మృతిపూర్వకంగా ఈ గ్రంథం ప్రకాశింపజేయబడుతున్నది. ఎన్నోమార్లు వారు నన్ను దేశి కప్రబంధానికి తెలుగు అనువాదం చేయమని అన్నారు. వారు ఈ లోకంలో ఉండగా ఆ ప్రయత్నం

నెరవేరక పోయినా గత సంవత్సరం వారి సంకల్పబలం కారణంగా ఆ గంథం ప్రచురింపబడింది. అది వారి మనసుకు తప్పక తృప్తిని కలిగించి ఉంటుంది. ప్రస్తుత ఈ ప్రయత్నం కూడా వారి మనసును రంజింపజేస్తుందని భావిస్తాను. ఈ అనువాదంలోని మంచి చెడ్డలను సుహృదయ పాఠకులు గమనించి ఆదరిస్తారని భావిస్తాను.



భాగవతవిధేయుడు,
**ఈయుణ్ణి అళ్లహ శింగరాచార్య దాసుడు**





**ఉ.వే. శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యస్వామివారు**

**యేన నిర్మథిత స్సర్వో దేశికోక్తిమహాంబుధిః,**
**సోయం వాచస్పతిః శ్రీమాన్ రాఘవార్యశ్చిరం జయేత్.**

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః

# సంప్రదాయపరిశుద్ధి

**రామానుజదయాపాత్రం జ్ఞానవైరాగ్యభూషణం,**
**శ్రీ మద్వేంకటనాథార్యం వందే వేదాంతదేశికం**

భగవద్రామానుజులు, అప్పుళ్ళార్ - అనే అచార్యుల దయకు పాత్రమైన వారు, జ్ఞానవైరాగ్యసంపన్నులు, వేంకటేశ్వర ఘంటావతారులుగా ప్రసిద్ధులగు వేదాంతదేశికులకు నమస్కరిస్తున్నాను.

**శీరొన్ఱు తూప్పుల్ తిరువేఙ్గడముడయాన్**
**పారొన్ఱ చ్చొన్న పழமொழியుళ్ - ఓరొన్ఱు**
**తానే యమైయాదో తారణియిల్ వాழ்వార్ కుక**
**వానేఱ పోమళవుం వాழ்వు**

కళ్యాణగుణాలను పొందికగా కలవారు, తూప్పుల్ అగ్రహారంలో శ్రీవేంకటేశ్వరుని ఘంటాంశతో అవతరించినవారైన దేశికులు పలికిన సూక్తులలో ఒక్కటి అయినా, ఈ జగత్తులో ఉండేవారు పరమపదాన్ని చేరేవరకు కాలక్షేపం చేయడానికి చాలదా? (చాలు)

**తమ్పర మెన్ఱిరఙ్గి త్తళరామనమ్ తన్దరుళాల్**
**ఉమ్బర్ తొழுమ్ తిరుమాల్ ఉకన్దేఱ్కుముపాయమొన్ఱాల్**
**నమ్పిఅవిత్తుయర్ మాఱ్ఱియ ఞానప్పెరుమ్తకవోర్**

**శమ్ప్రరదాయమొన్ని  చ్చదిర్ కుకమ్నిలై శార్ న్దనమే**

మనలను కాపాడడం తమ బాధ్యత అని తలచి, మనపై దయ చూపి, ఏ మాత్రం కలత చెందని మనస్సును మనకు కృపతో ఇచ్చి, నిత్యసూరులచే నమస్కరింపబడే భగవానుడు సంతోషించి మనలను అంగీకరించే ప్రపత్తి అనే ఉపాయంతో మన సంసారబంధాన్ని పోగొట్టినవారు, గొప్ప కరుణను, జ్ఞానాన్ని కలవారైన అచార్యుల సంప్రదాయంలో చేరి, ఉన్నత స్థితిని పొందాము.

*###### *

**ఆచార్య సమాశ్రయణావశ్యకత***:*

జీవుడు సద్గతిని పొందడానికి ఉన్నతంగా జీవించడానికి తగిన దారిని అన్వేషించాలి. దానికోసం అతడు వేదాంత శాస్త్రంలో చెప్పబడిన మంచి విషయాలను నిశ్చితమైన రీతిలో తెలిసి కోవాలి. అందుకోసం అతడు సదాచార్యుని ఆశ్రయించి, ఆ ఆచార్యుడు చేసే ఉపదేశాలను గ్రహించాలి. లేకపోతే సంప్రదాయానుసారంగా వచ్చిన గొప్ప అర్థాలను అతడు గ్రహించలేడు. ఈ విషయాన్ని ఉపనిషత్తులు, ఉపనిషత్తుల అర్థాలను వివరించే స్మృతి–ఇతిహాస పురాణాలు స్పష్టం చేస్తున్నాయి.

**సత్ సంప్రదాయ పద్ధతిలో విషయాలను విని తెలిసికోవడం***:*

ఈ విధంగా వేదాంత జ్ఞానాన్ని విరివిగా సంపాదించుకోవడానికి అవసరమైన వ్యుత్పత్తిని జ్ఞానాన్ని లేనివారు శాస్త్రాలను చక్కగా అభ్యసించిన ఆచార్యుల సన్నిధిలో ముఖ్యమైన సంప్రదాయ విషయాలను ఉపదేశ రూపంగా

పొందాలి. అప్పుడే జీవించడానికి కావలసిన ముఖ్య విషయాలలో నిశ్చయమైన జ్ఞానం కలుగుతుంది. ఆ ముఖ్య విషయాలను కూడా సదాచార్యసన్నిధిలో ఉపదేశ క్రమంలోనే గ్రహించాలి కానీ కేవలం శాస్త్రాల ద్వారా సంపాదించడానికి సాధ్యం కాదు. ఒకవేళ ఎవరైనా మేధావి అయిన వాడు అన్య శాస్త్రాలలో తనకు ఉండే పరిజ్ఞానం ద్వారా వేదాంత శాస్త్రాన్ని స్వయంగా అభ్యసించ గలిగిన సమర్థుడు కావచ్చు. కానీ దానివల్ల ఏ ఫలము దక్కదు. సంప్రదాయ మార్గంలో సంపాదించని ఆ జ్ఞానంలో స్పష్టత, పవిత్రత ఉండదు. అంతేకాక, ఆ జ్ఞానం తరించడానికి సాధనం కాబోదు.

**సత్ సంప్రదాయం అంటే ఏమిటి?:**

మన ఇంద్రియాలకు ఏమాత్రం అందకుండా శాస్త్ర సహాయం చేతనే సత్ సంప్రదాయానుసారంగా తెలియవలసిన విషయాలు అనేకం ఉన్నాయి. అవి ఏవి? అంటే, భగవంతుడు, మోక్షం, దానినిపొందడానికి వీలైన ఉపాయము మొదలైనవి. ఇవి మన కంటికి కనబడేవి కావు కదా! వీనిని అన్నిటినీ సంప్రదాయ మార్గంలోనే గ్రహించాలి. ఈ సంప్రదాయం శాస్త్రాలను ఆధారంగా చేసికొని వర్తించేదై ఉండాలి. కొందరు ఒకటిగా చేరి శాస్త్రాలకు విరుద్ధంగా ఏదో ఒక సంప్రదాయాన్ని కొత్తగా సృష్టించి పరంపరగా ప్రవర్తింప జేసినా అది నమ్మదగినది కాదు. అంతేకాక మహనీయులు ఇది ప్రమాణం అని ఏకగ్రీవంగా అంగీకరించిన సంప్రదాయానికి విరుద్ధమైనది కూడా నమ్మదగినది కాదు. ఎందుకంటే, ఈ రెండు సంప్రదాయాలను కల్పించినవారు యథార్థజ్ఞానం లేనివారై, విపరీత జ్ఞానాన్ని కలవారై ఉండవచ్చు, లేక, ఇతరులను తమ సంప్రదాయంలో కలుపు కోవాలి అని తలచి ఉండవచ్చు. ఈ విధంగా ప్రవర్తించే సంప్రదాయం

వేదాన్ని అంగీకరించని చార్వాకుడు మొదలైన వేద బాహ్యుల మతాలవలె మనం నమ్మదగినది కాదు, విడువదగినదే.

## సదస్య–రహస్యాల స్వరూపం:

ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చు. లోకంలో సదస్యం అని, రహస్యం అని రెండు ప్రసిద్ధంగా ఉన్నాయి. సదస్యం అంటే–అందరూ తెలిసికొని కలిగేటట్లు స్పష్టంగా అందరి మధ్య చెప్పదగినది. రహస్యం అంటే–నలుగురిలో కాకుండా ఏకాంతంలో చెప్పదగినది. భారతంలో భాగమైన గీతలో ఉండే చరమ శ్లోకాన్ని కొందరు రహస్యం అని, మరికొందరు సదస్యం అని అంటున్నారు. ఈ విధంగా అనడంలో పరస్పర వైరుధ్యం కనబడుతోంది. నాలుగు వర్ణాల చెందినవారు కూడా భారత రామాయణాది కథలను వినవచ్చును– అని శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ విధంగా అందరూ వినదగినది అయితే సదస్యమైన చరమ శ్లోకం ఏ విధంగా రహస్యం అనవచ్చు? ఈ విధంగా ఇది కూడా ఒక వైరుధ్యమే కదా! ఈ విధంగా పైన పైన గమనిస్తే రెండు పరస్పర విరుద్ధ స్వభావాలను తెలిపే ప్రయోగాలకు ప్రత్యేకించి  వివరణం కానీ, సమాధానం కానీ చెప్పనక్కరలేదు. ఈ విధంగా వాదించేవారి మాటలతోనే వారి వాదాలు తిరస్కరింపబడుతున్నాయి. సదస్యం అంటే రహస్యమనే వాదం తీరిపోతుంది. రహస్యం అంటే సదస్యం అనే వాదం తీరిపోతుంది. అందువల్ల వానిని ఖండించడం కోసం ప్రత్యేక ప్రయత్నం అక్కరలేదు.

## సదస్య– రహస్యాల మధ్య వైరుధ్యం లేదు:

అయినా,  పైన చెప్పబడిన ఆక్షేపం మన విషయంలో కూడా ప్రసక్త హమవుతున్నది. భారతం అందరూ వినదగినది–అని శాస్త్రాలు తెలుపుతున్నాయి–అనేది మనం

కూడా అంగీకరిస్తాము. అందువల్ల చరమ శ్లోకం రహస్యం అయినది. రహస్యాలు మూడింటిలో చరమ శ్లోకం మూడవది కావున అది రహస్యం కూడా. ఈ విధంగా ఈ వైరుధ్యం మనకి కూడా ఉన్నది కదా!–అనే ప్రశ్న ఇక్కడ కలుగవచ్చు. దీనికి తగిన సమాధానాన్ని ఈ విధంగా చెప్పవచ్చు పలువురి మధ్య చెప్పదగిన శబ్దాల అర్థాన్ని మాత్రం ఏకాంతంలో ఉపదేశించాలి–అని శాస్త్రం విధిస్తున్నది. అందువల్ల చరమ శ్లోకం దాని అర్థాను సంధానం లేకుండా శబ్దం మాత్రం ఉపదేశించి నప్పుడు అది సదస్యం అవుతుంది. కానీ దాని అర్థాలను రహస్యంగా ఉపదేశించాలి. అందువల్ల అది రహస్యంకూడా అవుతున్నది. ఈ విధంగా శబ్దము, దాని అర్థం–అని రెండుగా విభజించి సదస్యం, రహస్యం–అని ఈ రెండు స్వభావాలను చెప్పడంవల్ల ఇక్కడ ఏ విధమైన విరోధం లేదని గ్రహించాలి. చరమశ్లోకం - శబ్దాన్నిబట్టి సదస్యం, అర్థాన్ని బట్టి రహస్యం అనే నిర్ణయం ఏర్పడింది. అందుచేత చరమ శ్లోకం సదస్యం అనే ప్రమాణానికి, రహస్యమనే సంప్రదాయానికి మధ్య ఏ విధమైన విరోధం లేదు–అని తేలింది.

**ప్రమాణాల మధ్య ఏ విరోధం లేదు:**

ఇక్కడ ఇంకొక ప్రశ్న తోచవచ్చు. పూర్వం చరమ శ్లోక విషయంలో ప్రమాణాలకు సంప్రదాయానికి మధ్య విరోధం లేదు–అని అంగీకరింప బడింది కదా. కానీ ప్రమాణాల మధ్య పరస్పరం విరోధ భావము కనబడుతున్నది. ఉపనిషత్తులలో కూడా ఏది గొప్ప ప్రమాణం? ప్రజాపతి అనే బ్రహ్మ ఇంద్రునకు విరోచనునకు సంసార బంధవిముక్తుడైన ఆత్మ స్వరూపాన్ని గూర్చి వివరించేటప్పుడు మొదట శరీరమే ఆత్మ అని, తరువాత వేరు వేరు రీతులలో ఆత్మ స్వరూపాన్ని నిరూపించాడని ఉపనిషత్తులలో తెలుపబడినది. ఇది చాలా పెద్ద విరోధం కదా! అనేది ఆ ఆక్షేపము.

దీనికి సమాధానం ఈ క్రింది విధంగా చెప్పవచ్చు. బ్రహ్మ దేవుని దగ్గర దేవతల ప్రభువైన ఇంద్రుడు, అసురుల ప్రభువు అయిన విరోచనుడు ఆత్మకు సంబంధించిన ఉపదేశాన్ని పొందాలని వెళ్లారు. అప్పుడు దేవతలకు శత్రువైన విరోచనునకు శరీరమే ఆత్మ–అని పలికి, మోహాన్ని కలుగజేసి అతనిని పంపవలసిన అవసరం బ్రహ్మకు కలిగింది. అందువల్ల అతనికి ఆ విధంగా బ్రహ్మ ఉపదేశించాడు. విరోచనుడు కూడా ఆ ఉపదేశంతో తృప్తిపడి వెళ్ళిపోయాడు. దీనిని తెలిపే భాగమే అసుర ఉపనిషత్ అనబడుతున్నది. తరువాత ఇంద్రుడు ఈ ఉపదేశాన్ని విని బాగా పరిశీలించి చూచి శరీరమే ఆత్మ అయితే తోచే అనేక అనుపపత్తులను గమనించి, మళ్ళీ బ్రహ్మ దగ్గరకు వచ్చాడు. అప్పుడు బ్రహ్మ అతనికి కలలో కనిపించే శరీరాన్ని, దానితో తృప్తి పొందని అతనికి నిద్రించే శరీరాన్ని, అప్పటికీ తృప్తిని పొందని అతనికి యథార్థమైన ఆత్మ స్వరూపాన్ని ఉపదేశించాడు. ఈ విధంగా వారి వారి యోగ్యతలను బట్టి, వారు వారు ఆశ్రయించిన రీతులను బట్టి పర్వ క్రమంలో వేరు వేరు రీతులలో ఉపదేశించిన బ్రహ్మ, చివరలో యథార్థమైన ఆత్మ స్వరూపాన్ని ఇంద్రునకు ఉపదేశించి, అతనికి తృప్తి కలిగించడం వల్ల, ఈ ఉపనిషత్ వాక్యాలలో పరస్పర విరోధం ఏమాత్రం లేదు–అని గ్రహించాలి.

### ఉపనిషత్తులలో విరోధం ఏమీ లేదు:

మళ్ళీ ఇక్కడ ఇంకొక ప్రశ్న తల ఎత్తున్నది. ముఖ్యమైన ప్రమాణంగా చెప్పబడే ఉపనిషత్తులలో ఒకటి రెండు చోట్ల పూర్వాపర విరోధాలు ఉన్నట్లు కనిపిస్తున్నది. అది ఏ విధంగా? అంటే, మోక్ష సాధనాలుగా చెప్పబడే బ్రహ్మవిద్యలలో ఉపకోసల విద్య, వైశ్వానర విద్య–అనే రెండు విద్యలున్నాయి. ఇవి ఉపనిషత్తులలో వివరింప బడ్డాయి. ఉప కోసల విద్యలో ఉపకోసలుడు అనేవానికి త్రేతాగ్నులు బ్రహ్మ విద్య యొక్క

భాగములను ఉపదేశించి ఒక్కొక్క భాగానికి ఒక్కొక్క ఫలాన్ని తెలిపినవి. తర్వాత ఆచార్యుడైన జాబాలి వచ్చి, బ్రహ్మ విద్య యొక్క సంపూర్ణస్వరూపాన్ని, దాని ఫలాన్ని ఉపదేశించాడు –అని ఉపనిషత్తులలో తెలుపబడింది. కొన్ని భాగాలను మాత్రమే ఉపదేశించి వాని ఫలాలను తెలుపడం, తర్వాత మొత్తం తెలిపి దాని ఫలం తెలుపడం అనేవి రెండు పరస్పర విరుద్ధాలు కదా. ఈ విధంగానే వైశ్వానర విద్యలో కూడా మొదట వైశ్వానరుడు అనే ఆత్మను ప్రత్యేక ప్రత్యేకంగా ఉపాసించాలి అని, ఆ తర్వాత మొత్తంగా ఉపాసించాలి అని ఉపనిషత్తు పలకడంలో పరస్పరవిరోధం కనిపిస్తున్నది కదా–అనేది ఇక్కడ చేయబడే ఆక్షేపం.

దీనికి సమాధానాన్ని ఈ విధంగా చెప్పవచ్చు. పై రెండు విద్యలలో మొదట కొన్ని భాగాలను మాత్రమే ఉపదేశించినా, వానిని మాత్రం తెలిసి ఉపాసించడం చాలదని, మిగిలిన దానిని కూడా గ్రహించి క్రమంగా ఉపాసించి తద్ద్వారా పూర్తిగా ఉపాసన చేయాలని అనడమే ఇక్కడ ఉపనిషత్తు హృదయము.ఉపకోసల విద్యలో కొన్ని భాగాలను మాత్రం ఉపదేశించిన అగ్నులు "మిగిలిన భాగాలను ఆచార్యుడు ఉపదేశిస్తాడు" అని అనడం వల్ల తరువాత ఆ జ్ఞానాన్నికూడా గ్రహించి ఉపాసించాలి– అని అవి చెప్పినట్లుయినది. ఆ విధంగానే వైశ్వానర విద్యలో కూడా మొదట పరమాత్మ యొక్క కొన్ని భాగాలను, ఉపాసనను, దాని ఫలాన్ని తెలిపిన తరువాత పూర్ణమైన ఉపాసన వల్ల కలిగే ఫలాన్ని కొంచెం కొంచెంగా విభజించి తెలిపింది తప్ప, ప్రత్యేక ప్రత్యేకంగా ఉపాసించడం తో నిలుపవచ్చునని తెలుపడంలో ఉపనిషత్తు కు ఉద్దేశ్యం లేదు–అనేది వాస్తవమైన స్థితి. ఈ అంశాన్ని ముందు కనిపించే ఉపనిషత్ వాక్యాలలో తెలియవచ్చు. అందుచేత, ఉపనిషత్తు పరస్పర విరుద్ధమయిన అర్థాలను తెలుపుతున్నది–అని అనడం సరికాదు.

పూర్వం చెప్పబడిన వృత్తాంతాలను బట్టి పలు అంశాలను ఒకడు వేరొకని దగ్గర ఉపదేశం పొందినా, ముఖ్యమైన, పూర్ణమైన అంశాలను మాత్రం ఆచార్యుని సన్నిధిలోనే ఉపదేశ రూపంగా పొందాలి– అనే విషయం స్పష్టమవుతున్నది.

**పలువురు జ్ఞానుల సన్నిధిలో ప్రశ్నించి తత్వార్థాలను తెలుసుకోవడం***:*

ఈ విధంగానే మహనీయులైన ఆచార్యుల సన్నిధిలో పరిపూర్ణంగా ఉపదేశం పొందిన ఆ అర్థ విశేషాలను మనసులో స్థిరంగా నిలుపుకోవడం కోసం పలువురు జ్ఞానుల వద్ద వాటిని మళ్ళీ ఆలకించడం కూడా ఆవశ్యకం. భగవానుడు శ్రీకృష్ణుని రూపంలో అవతరించి, భగవద్గీతలో అర్జునునకు పరిపూర్ణమైన ఉపదేశాన్ని చేశాడు. అయినా ఒకసారి ఉపదేశిస్తే చాలదని స్వామి భావించాడు. ఎందుకంటే మానవులకు పాపం వల్ల రజోగుణం, తమోగుణం తలెత్తుతాయి. అవి నిండుగా ఉండే మనసులో ఒకసారి ఉపదేశించిన అర్థం స్థిరంగా నిలువదు. అందుచేత తాను ఉపదేశించిన అర్థాలని మళ్ళీ మళ్ళీ పలువురు మహనీయులను సేవించి అడిగి ఉపదేశంగా పొంది వాటిని మనసులో పదిలంగా నిలుపుకోవాలి అనే అంశాన్ని "పరిప్రశ్నేన సేవయా "అని అంటూ తెలియజేశాడు. ఈ విధంగా "మైత్రేయః పరిపప్రచ్ఛ ప్రణిపత్యాభివాద్య చ" అనే విధంగా పలువురి దగ్గర విని తెలిసికొని మనసులో స్థిరంగా నిలుపుకున్న అర్థాలను ఆధారంగా చేసుకొని వచ్చిన సంప్రదాయమే గొప్పది. అందువల్ల ప్రపన్నుడు గ్రహించే సంప్రదాయం అందరూ అంగీకరించినది, శాస్త్రాలకు అవిరుద్ధమైనదిగా ఉండాలి. “శాస్త్రాల ఆధారంగా వచ్చినది”–అని పెద్దలచే అంగీకరింప బడినది కావాలి.

**తత్త్వ విషయంలో విరోధం లేదు:**

ఈ విధంగా గొప్ప క్రమంలో వచ్చిన సంప్రదాయంలో కూడా తత్త్వవిషయాలలో కూడా పైపైన గమనించి చూస్తే కొన్ని విరోధాలు తోచవచ్చు. వాస్తవాన్ని గ్రహించి చూస్తే అటువంటి విరోధాలు ఏమీ లేవని స్పష్టమవుతుంది. ఏదైనా ఒక విషయాన్ని బట్టి ఆ విరోధాలు ఆపాతతః తోచవచ్చు. ఉదాహరణకు భగవానుని అవతారాలు నాలుగు అని కొన్ని చోట్ల, మూడు అని కొన్ని చోట్ల చెప్పబడింది. ఇది పైపైన చూస్తే పరస్పర విరుద్ధంగా కనిపిస్తుంది. నిజానికి వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులనే నాలుగు రూపాలను బట్టి వ్యూహ రూపాలు నాలుగు అని చెప్పబడింది. అయితే, ఆ వ్యూహాలలో మొదటిది అయిన వాసుదేవ రూపంలో, పరమపదంలో ఉండే వాసుదేవ రూపంలో జీవుడు అనుసంధించ దగిన గుణాలు వేరువేరుగా ఉండకపోవడంచేత వ్యూహ, వాసుదేవరూపాలను పరవాసుదేవ రూపంతో చేర్చి వ్యూహ రూపాలు మూడు - అని కొన్ని చోట్ల చెప్పబడింది. అందువల్ల ఇక్కడ ఏ విధమైన విరోధం లేదు కదా.

**అనుష్ఠాన విషయంలో కూడా ఏ వైరుధ్యం లేదు:**

ఈ విధంగానే అనుష్ఠాన విషయంలో కూడా ఏదైనా విరోధం పైపైన చూచినప్పుడు కనిపించవచ్చు. జీవుడు తన ఆత్మను దర్శించడానికి కర్మయోగంతో మనః శుద్ధిని పొంది, తరువాత జ్ఞాన యోగాన్ని అనుష్ఠించకుండా కర్మయోగం ద్వారానే ఆత్మను దర్శించవచ్చు–అని తెలుపబడింది. ఇది పైపైన చూచినప్పుడు విరుద్ధంగా కనిపిస్తుంది కదా! కానీ లోతుగా వాస్తవాన్ని దర్శిస్తే ఇక్కడ ఏ విరోధం లేదు అని తెలుస్తుంది. ఈ భేదం ఉపాసించే మానవుల యోగ్యతను బట్టి ఏర్పడింది. కర్మ యోగానికి తరవాత జ్ఞాన యోగాన్ని అనుష్ఠించే యోగ్యతను కలవాడు ఉండవచ్చు. ఆ విధంగా అనుష్ఠించి ఆత్మ

సాక్షాత్కారాన్ని పొంది జ్ఞానయోగాన్ని చేసే యోగ్యతను లేనివాడై ఉండవచ్చు. యోగ్యత ఉన్నా పూర్వం చేయడంవల్ల అలవాటుపడిన కర్మయోగాన్ని చేయాలనే ఆశను కలవాడై ఉండవచ్చు. ఇటువంటి వాడు ఆత్మసాక్షాత్కారం వరకు కర్మ యోగం చేసి, జ్ఞాన యోగం చేయకుండానే ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతాడు. ఈ విధంగా యోగ్యతను బట్టి తేడా ఉండడంవల్ల ఇక్కడ ఏ విరోధం లేదని గ్రహించాలి.

కర్మయోగంలోని విభాగాలలో ఒక విభాగాన్ని ఆచరించేటప్పుడు ఈ క్రమం లేకుండా దేనిని అయినా ఆచరింపవచ్చు–అనే క్రమం కూడా ఉన్నది. అనగా– కర్మయోగంలో దేవతారాధన, తపస్సు చేయడం, తీర్థయాత్ర, దానం, యాగాలను చేయడం మొదలైన పలు రీతులు ఉన్నాయి. వీటిలో ఏదో ఒక రీతిని చేయడంలో అవధి ఏదీ లేదు. వీటిలో ఏది ఇష్టమైతే దానిని ఆచరింపవచ్చు. అందువల్ల అనుష్ఠాన విషయంలో కూడా వైరుధ్యం ఏమీ లేదని భావించాలి.

మోక్షసాధనలైన భక్తిప్రపత్తులనే రెండు ఉపాయాలను గూర్చి ఆలోచించి చూద్దాం. ఈ రెండిటిలో దేనిని అయినా అనుసరించడంలో ఏదైనా ఒక నియమం ఉన్నదా? లేదా? యోగ్యతలో నియమం ఉన్నది. భక్తి యోగాన్ని, దానిని చేయడంలో యోగ్యత కలవారు, ఆచరించాలి. ఆ యోగ్యత లేనివాడు ప్రపత్తిని ఆచరించాలి. అందువల్ల యోగ్యతలో ఇటువంటి తేడా ఉండగా, "భక్తిని కానీ ప్రతిపత్తిని కానీ చేయవచ్చు" అని ఏ తేడా లేని రీతిలో పలుకుతున్నారే! - అని అంటే, ఇక్కడ ఈ మాటలో తాత్పర్యం వేరు. ఆ రెండిటిని ఆచరించడంలో యోగ్యతను కలవారు ఆ రెండిటిలో దేనిని అయినా ఆచరించినా పొందే ఫలమైన మోక్షంలో భేదం లేదు కదా. అందుచేత ఫలాన్నిగూర్చిన భేదం

లేదు – అని అనడంలోనే వారి తాత్పర్యం. అందువల్ల ఇక్కడ కూడా ఏ విధమైన విరోధం లేదు.

**అస్మత్ సంప్రదాయం:**

కరుణామయుడు అయిన భగవంతుడు అందరిని తరింప చేయాలి–అనే చల్లని భావంతో వేదాంతశాస్త్ర సంప్రదాయాన్ని మొట్టమొదట వ్యక్తీకరించాడు. భగవానుడు తాను నేరుగా లక్ష్మీదేవికి దానిని ఉపదేశించాడు. లక్ష్మీదేవి విష్వక్సేనునకు, ఆయన నమ్మాళ్వార్లకు ఉపదేశించారు. ఈ విధంగా ప్రవర్తించిన ఆచార్య పరంపరలో భగవానుడు సంప్రదాయాన్ని లక్ష్మీదేవికి సాక్షాత్తుగా, మిగిలినవారికి లక్ష్మీదేవి,విష్వక్ సేనుడు మొదలగు ఆచార్యుల ద్వారా జ్ఞానోపదేశం చేస్తున్నాడు–అనేది సిద్ధం. మిగిలిన ఆచార్యులు తమ తమ ఆచార్యుల ద్వారా ఉపదేశాన్ని పొంది సత్సంప్రదాయ ప్రచారాన్ని చేశారు.

**పూర్వ యుగాలలో ప్రవర్తించిన వేదాంత సంప్రదాయ క్రమం:**

మొదట వేదాంత సంప్రదాయం లోకంలో ప్రచారాన్ని చేసినవారు – వ్యాసమహర్షి, బోధా యనుడు మొదలైనవారు. వారు తత్త్వాలను ఇతర మతాలవారివలె కాకుండా, యథార్థమైన రీతిలో గ్రహించారు. వారు తాము తెలిసిన శాస్త్రార్థాలను తమ శిష్యులకు ఉపదేశించారు. వారిచే ఉపదేశింపబడిన శిష్యులు కూడా అసూయ, ఈర్ష్య మొదలైన దుర్గుణాలను లేని వారు. వారు తమ ఆచార్యులను సేవించి, సత్సంప్రదాయ క్రమంలోనే ఉపదేశాలను పొందారు. ఆ విధంగా యోగ్యతను కల తమ శిష్యులకు వ్యాసబోధాయనాదులు తగిన రీతిలో వేదాంత శాస్త్రాన్ని ఉపదేశించారు. వారికి తరువాత బ్రహ్మనంది అనబడే టంకుడు,

గుహ దేవుడు మొదలైనవారు వేదాంత శాస్త్రాన్ని తమ శిష్యులకు ఉపదేశించారు. వీరు అందరు ముందు యుగంలో సిద్ధాంతాన్ని, సత్సంప్రదాయాన్ని ప్రవచన ప్రచారాలను చేసిన మహనీయులు.

**కలియుగంలో సత్ సంప్రదాయ ప్రవర్తకులు శ్రీ శఠకోపులు:**

వీరికి తరువాత కలియుగం ఆరంభమైనది. ఈ యుగంలో మొట్టమొదటగా వేదాంత శాస్త్రాన్ని ఈ లోకంలో ప్రచారం చేసిన ఆచార్య సత్తములు నమ్మాళ్వార్లు. వీరిన సన్నిధిని మొట్టమొదట ఆశ్రయించి ఉజ్జీవించినవారు మధుర కవులు. వీరి కాలం ద్వాపర యుగం చివరి భాగం. వీరు జీవించిన కాలంలో శ్రీకృష్ణుడు ఇంకా ఈ లోకంలో వేంచేసి ఉన్నాడు. అతడు సాక్షాత్తు భగవానుని అవతారమే అనే విషయం మధుర కవులకు తెలుసు. అతనిని వారు ఆశ్రయించి ఉండవచ్చు. కానీ ఆ విధంగా చేయలేదు. ఆచార్య ముఖంగా భగవానుని ఆశ్రయించడమే తగిన పని అని వారు భావించారు. అందువల్ల తమ మనసుకు నచ్చిన గొప్ప ఆచార్యుల కోసం వారు ఎదురు చూశారు. కలియుగం ఆరంభంలో నమ్మాళ్వార్లు అవతరించారు. వారు కలియుగంలో వేదాంత సంప్రదాయాన్ని లోకంలో ప్రచారం చేశారు. వీరిని మధుర కవులు ఆశ్రయించారు. నమ్మాళ్వార్ల కంటే ఇంకొక ఏ దైవం లేదనే గొప్ప నిశ్చయాన్ని కలవారు మధుర కవులు.

**శఠకోపుల ఆచార్యత్వ పూర్తి:**

బ్రాహ్మణ కులంలో అవతరించిన శ్రీ మధుర కవులు, శూద్ర జాతికి చెందిన నమ్మాళ్వారుల వద్ద ఉపదేశాన్ని పొంది వారిని ఆచార్యులుగా ఏవిధంగా అంగీకరించారు? అనే ప్రశ్న సహజంగా ఇక్కడ కలుగుతుంది. దీనికి సమాధానం ఏమంటే "బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కులాలకు చెందిన వారిలో ముందు కులానికి చెందినవారు లభ్యం కాకపోతే తరువాతి

కులంలోనివారి వద్ద బ్రహ్మ జ్ఞానాన్ని పొందాలి "–అనే విషయం "ప్రాప్య జ్ఞానం బ్రాహ్మణాత్ క్షత్రియాద్వా వైశ్యాత్ శూద్రాద్వాపి నీచాదభీక్ష్ణమ్, శ్రద్ధాతవ్యం శ్రద్ధధానేన నిత్యం న శ్రద్ధినం జన్మమృత్యూ విశేతామ్" (జ్ఞానాన్ని బ్రాహ్మణుని వల్లకాని, క్షత్రియుని వల్ల కాని, వైశ్యుని వల్ల కాని శూద్రుని వల్ల కాని, లేక, అంతకంటే తక్కువ కులానికి చెంది వారి వల్ల కానీ మాటిమాటికి ప్రయత్నించి సంపాదించాలి. జ్ఞానాన్ని పొందడంలో సదా శ్రద్ధ కలిగి ఉండాలి. శ్రద్ధగా జ్ఞానాన్ని పొందే వానిని జన్మ మృత్యువులు బాధించవు" ఇత్యాది ప్రబల ప్రమాణాలు తెలుపుతన్నాయి. అందువల్ల వైదికులు ఆదరించే వేదాంతార్థాలను మన చిత్తంలో స్థిరంగా ఉండేటట్లు ఆళ్వారుల సూక్తుల ద్వారా ఉపదేశింపబడినదై, శ్రీ మధుర కవులు "మిక్క వేదియర్ వేదత్తినుట్పొరుళ్ నిఱ్కప్పాడి ఎన్నెంజుళ్ నిఱుత్తినాన్ " (పరమ వైదికులు అధ్యయనం చేసే వేదాంత సారం స్థిరంగా నిలచి ఉండేటట్లు తిరువాయ్ మొళ్ళి ప్రబంధాన్ని అనుగ్రహించి, నా మనసులో అది నిలిచి ఉండేటట్లు మధురకవులు అనుగ్రహించారు)–అని అంటూ స్వయంగా మధురకవులు పలికిన సూక్తి చక్కగా ఇక్కడ పొసగుతుంది.

**వేదాంతార్థాలను విశదీకరించడంలో ద్రావిడ వేదానికి కల సామర్థ్యం***:*

ఇక్కడ ఒక ప్రశ్న కలుగుతుంది. సంస్కృత భాషలో తప్ప మిగిలిన భాషలలోని సూక్తులను బ్రాహ్మణులు అంగీకరించరు కదా. బ్రాహ్మణుడు అయిన శ్రీ మధుర కవులు ద్రావిడ భాషలో ఉండే ఆళ్వార్ల సూక్తులను ఏ విధంగా అంగీకరించారు? అనేది ఆ ప్రశ్న. దీనికి సమాధానం ఏమంటే "ఏ భాషలో భగవానుని స్తుతించినా ఆ స్తుతిని అంగీకరించవచ్చు. సంస్కృత భాషలో కూడా నీచం అయిన విషయాలను పలికితే

వాటిని అంగీకరిస్తామా? లేదు కదా! ఆళ్వార్ల సూక్తులు వేదాంత శాస్త్రాలలోని పరమ రహస్యాలైన అర్థాలను చాలా స్పష్టంగా అందరికీ తెలిసేటట్లు తెలుపుతున్నందున వానిని ఎవరైనా అంగీకరించి కీర్తించడంలో తప్పు లేదు.

**విదురుని సూక్తిని వివరించడం:**

ఇంతేకాక ఈ విధంగానే నాలుగవ వర్ణానికి చెందిన ధర్మవ్యాధుడు, తులాధారుడు మొదలైనవారు తమను ఆశ్రయించిన బ్రాహ్మణులకు పలు సారవంత లైన అర్థాలను ఉపదేశించడం ఇతిహాసాలలో చూడవచ్చును. ఇక్కడ ఇంకొక విషయం. విదురుడు ధర్మ పుత్రునకు పలు గొప్ప ధర్మాలను ఉపదేశించేటప్పుడు ఒక చోట తన ఉపదేశాలను నిలిపి, శూద్రయోనౌ వహం జాతో నాతోఽన్యద్వక్తుముత్సహే (భారత–ఉద్యోగ–42–56)(శూద్రకులంలో పుట్టిన నేను ఇంతకు మించి ఏమి చెప్పదలచ లేదు) అని అన్నాడు కదా. మరి ధర్మవ్యాధుడు, తులాధారుడు మొదలైనవారు నీచ కులజులైనా ఏ విధంగా ఉపదేశించారు? అంతేకాక విదురుడు మొదలైనవారు ఏ విధంగా ఉపదేశించారు? అనే సందేహం కలుగుతుంది. దీనికి సమాధానం ఏమంటే–అక్కడ ధర్మవ్యాధుడు మొదలైనవారు ఉపదేశించిన విషయం, విదురుడు మొదట ఉపదేశించిన విషయం వేరు.తరువాత విదురుడు ఇక ఉపదేశించడానికి తనకు యోగ్యత లేదని పలికిన విషయం వేరు. ధర్మవ్యాధుడు మొదలైనవారు, ప్రారంభంలో విదురుడు ఉపదేశించినది బ్రహ్మ విద్య కాదు. మంత్రము కూడా కాదు. భగవానునకు సంబంధించిన సామాన్య విషయాలను మాత్రమే వీరు ఉపదేశించారు. విదురుడు అటువంటి సామాన్య విషయాలను ఉపదేశించిన తరువాత ఇకపై తెలిసి కోవలసిన విషయాలను బ్రహ్మ విద్య, మంత్రం మొదలైన వానిని ఉపదేశించడానికి శూద్ర కులంలో పుట్టిన తనకు యోగ్యత

లేదు అని తెలియజేశాడు. అందువల్ల ఇక్కడ ఏమీ విరోధం లేదు –అనేది సమాధానం.

**నమ్మాళ్వార్లు శ్రీనాథమునులకు రెండు విధాలుగా ఆచార్యులు***:*

శ్రీ నాథమునులకు నమ్మాళ్వార్లు వరుస క్రమం లోనే కాక సాక్షాత్తుగా కూడా ఆచార్యులు. ఏ విధంగా? అంటే– నాథమునులకు పరాంకుశ దాసులు అనేవారు కణ్ణినుణ్ శిఋత్తాంబు అనే ప్రబంధాన్ని ఉపదేశించారు. ఈ పరాంకుశ దాసులు మధుర కవుల వంశంలో జన్మించినవారు. అందువల్ల వారికి ఆచార్య పరంపరలో ముందు వారు మధుర కవులు. వారికి ఆచార్యులు నమ్మాళ్వార్లు. ఈ విధంగా నాథమునులకు నమ్మాళ్వారులు పరంపరా క్రమంలో ఆచార్యులు అయ్యారు. అంతేకాక, తిరుక్కురుకూర్ లోని తింత్రిణీ వృక్ష మూలంలో నాథమునులు యోగంలో ఉన్నప్పుడు పరవాసుదేవుని అజ్ఞను అనుసరించి నమ్మాళ్వారులు మళ్ళీ నాథమునుల కోసం ఈ లోకంలో అవతరించి, సాక్షాత్తుగా వారికి అన్ని వేదాంతార్థాలను, ద్రవిడ వేదాన్ని ఉపదేశించారు. అందువల్ల నాథములకు నమ్మాళ్వార్లు సాక్షాత్తుగా కూడా ఆచార్యులయ్యారు.

**ప్రపన్న కూటస్థులు నమ్మాళ్వారులు ఒకరే***:*

ప్రపత్తి అనే ఉపాయం భక్తియోగంవలె మోక్షానికి సాధనమని ఉపనిషత్తులు మొదలైనవి తెలుపుతున్నవి. నమ్మాళ్వార్లకు ముందు చాలామంది ప్రపత్తిని ఆచరించారు. కానీ ఆళ్వా ర్లకు తరువాతే ప్రపత్తి అనే ఉపాయం మిక్కిలి ప్రచారంలోకి వచ్చింది. ఆళ్వారులు తమ సూక్తుల ద్వారా తమ అనుష్ఠానం ద్వారా చాలా ప్రపత్తికి చాలా గౌరవాన్ని కలిగించి నూతనమైన ఉత్తేజాన్ని కలిగించారు. తమకు తరువాత పుట్టినవారికి చాలా

సులభమైన ప్రపత్తిని ఉపదేశించి వారి ఉజ్జీవనానికి మూల కారణం అయ్యారు. అందుచేత ప్రపత్తిని అనుష్ఠించేవారి పరంపర అనే ప్రపన్న సంతతికి నమ్మాళ్వార్ లు మూలపురుషులై, ప్రపన్న జనకూటస్థులని కీర్తింపబడుతున్నారు కూడా. యామునులు ఆళ్వార్లను "ఆద్యస్య నః కులపతేః" అని కీర్తించడం గమనించవచ్చు. ఈ విధంగా నమ్మాళ్వార్ల కటాక్షాన్ని పొందిన నాథమునులు ఈ సంప్రదాయాన్ని మొదటగా ప్రవచించగా, వారి మనుమలైన యామునులు తమ గొప్ప సూక్తులతో ఈ సంప్రదాయాన్ని అభివృద్ధి చేశారు.

**శ్రీనాథమునులు తమ పౌత్రులకు తాము ఆచార్యులు కాకపోవడానికి కారణాలు:**

శ్రీనాథమునుల మనుమలు యామునులు. ఈ పితామహ–పౌత్రులు ఇద్దరు సమకాలంలో ఉండే అవకాశం ఏర్పడింది. తమ మనుమడు యామునులకు నాథమునులు తామే స్వయంగా ఉపదేశించి, తామే నేరుగా ఆచార్యులై ఉండవచ్చును. కానీ, వారు ఆ విధంగా చేయలేదు. వారు తమ శిష్యులైన పుండరీకాక్షులను పిలచి వారి వద్ద తమ పౌత్రులకు వేదాంత విద్యను సంపాదించాలి అనే ఆశ ఎప్పుడు కలుగుతుందో అప్పుడే వారికి ఉపదేశం చేసి వారిని శిష్యునిగా స్వీకరించమని ఆదేశించారు. ఈ విధంగా నాథమునులు యామునులకు తామే నేరుగా ఉపదేశించకపోవడానికి మూడు కారణాలు ఉన్నాయి:

1) ఒక ఆచార్యుని దగ్గర ఒక శిష్యుడు వేదాంత విద్యను ఉపదేశంగా పొందితే ఆ ఆచార్యుని పుత్రపౌత్రాదులకు ఆ శిష్యుడు ఆ విద్యను ఉపదేశించాలి. వారు కూడా ఆ శిష్యునివద్ద ఉపదేశాన్ని పొందడానికి తగిన యోగ్యత కలవారు కావాలి. ఈ సత్యాన్ని తెలియజేయాలనే ఉద్దేశ్యంతోనే నాథమునులు తమ శిష్యులైన పుండరీ

కాక్షులను పిలచి యామునులకు వేదాంత జ్ఞానాన్ని ఉపదేశించాలని నియమించారు.

2) ఒక ఆచార్యుని ఆశ్రయించి కొందరు శిష్యులు విశేష జ్ఞానాన్ని సంపాదించి ఇతరులకు ఉపదేశించిన గల అన్ని యోగ్యతను పొందారు. ఆ ఆచార్యుని సంతతి లో పుట్టిన వారు తమకు ముందే తమ పూర్వుల వద్ద ఉపదేశింపబడిన ఆ శిష్యుని విషయంలో ఎటువంటి అభిప్రాయాన్ని కలవారై ఉంటారు? వీరు తమ పూర్వుల శిష్యులే కదా–అని భావించి గౌరవించకుండా ఉంటారు కదా. వారిని తాము ఆశ్రయించకూడదు అని కూడా భావిస్తారు. కానీ ఇది తగదు. ఆచార్యుల సంతతిలో పుట్టిన వారు తమకు ముందే తమ పూర్వులను ఆశ్రయించిన శిష్యులు జ్ఞానసంతతిలో తమకు ముందువారు అనే విషయాన్ని భావించి, వారిని తమ ఆచార్యునిగా భావించి ఆదరించాలి. వారి వల్ల ఉపదేశాన్ని పొందవచ్చు కూడా. ఈ వాస్తవాన్ని లోకంలో తెలియజేయాలని నాథమునులు ఈ విధంగా చేశారు.

3) ఆచార్యుడు శిష్యులకు ఉపదేశం వినాలనే కుతూహలం ఉన్నదా? లేదా? అని గమనించిన తరువాతనే ఉపదేశించాలి. శిష్యునకు శ్రద్ధ లేకపోతే అతనికి బలవంతం చేసి ఉపదేశిస్తే, ఆ ఉపదేశం శ్రద్ధ లేని ఆ శిష్యుని మనస్సులో నిలకడగా నిలువదు. నాథమునులు జీవించి ఉండే కాలంలో యామునులకు అటువంటి శ్రద్ధ కలుగనందున వారు ఉపదేశాన్ని పొందడానికి తగిన యోగ్యత కలవారు కాలేదు. ఈ విధంగా ఆర్తి లేని శిష్యులకు ఉపదేశించ రాదు–అనే ఈ విషయాన్ని లోకానికి తెలియజేయాలి– అని నాథమునులు యమునులకు ఉపదేశించలేదు.

ఈ విధంగా ఈమూడు అంశాలను మనసులో పెట్టుకొని నాథమునులు తమ మనుమలు అయినా యామునులకు తాము నేరుగా వేదాంతోపదేశం చేయలేదు. సాక్షాత్ ఆచార్యులు కాలేదు.

**మణక్కాల్ నంబి యామునులకు ఆచార్యులు కావడం**:

నాథమునుల శిష్యులైన ఉయ్యక్కొండార్ అ ఆచార్యుల అజ్ఞానుసారంగా యామునులకు తాము వేదాంతవిద్యను నేరుగా ఉపదేశించడానికి వీలు కాలేదు. తమ శిష్యులైన మణ క్కాల్ నంబి ద్వారా ఉపదేశింపజేయవలసి వచ్చింది. ఎందుకంటే, యామునులు తర్క మీమాంసా వ్యాకరణాది సామాన్య శాస్త్రాలను బాగా అధికరించి, గొప్ప మేధావియై, ప్రతివాదులను వాదంలో ఓడించి, ప్రభువు గౌరవాన్ని పొంది, గొప్ప రాజ భోగాలను అనుభవిస్తూ ఉన్నారు. పుండరీకాక్షులు తమ వయస్సు పెద్దది కావడంచేత వారికి పరమపదానికి చేరవలసిన కాలం సమీపించింది. అప్పటికి యామునులు లౌకిక విషయాలలోనే ఆసక్తిని కలిగి ఉన్నారు. అందుచేత తమ శిష్యులలో ప్రధానులైన శ్రీరామ మిశ్రులను పిలిచి, యామునులకు తగిన కాలంలో వేదాంత శాస్త్రాన్ని ఉపదేశించిన తమ శిష్యునిగా గ్రహించమని నియమించారు. పుండరీకాక్షులు ఆచార్యుల ఆజ్ఞను పూర్తి చేయలేని నిస్సహాయ స్థితిలో తమ శిష్యులు, నాథమునుల ప్రశిష్యులు అయిన శ్రీరామమిశ్రుల ద్వారా ఆచార్యుల అజ్ఞను పూర్తి చేయగలిగారు.

**యామునులను సంస్కరించడం కోసం శ్రీరామ మిశ్రులు చేసిన యుక్తి**:

యామునులు ఎదురులేని అధికారంతో రాజభోగాలను అనుభవిస్తూ ఉన్నారు. వారు స్వయంగా వచ్చి తమను

ఆశ్రయిస్తారు–అనేది జరుగదు–అని శ్రీరామ మిశ్రులకు తోచింది. తమ ఆచారర్యుల అఙ్ఞాను పూర్తి చేయాలి కదా.. అందుచేత శ్రీరామ మిశ్రులు స్వయంగా ప్రయత్నించవలసి వచ్చింది. యామునుల దగ్గరకు వెళ్ళి నేరుగా మాట్లాడే అవకాశం లేక పోవడం చేత శ్రీరామ మిశ్రులు ఒక ఉపాయాన్ని ఆలోచించారు. యమునులకు ముళ్ళ ఉస్తి కూర చాలా ఇష్టమని వారి అంతరంగ సేవకుల ద్వారా గ్రహించి, ప్రతి దినం ఆ కూరను తీసికొని వచ్చి యామునుల పంట శాలలో అందజేశారు. ఈ విధంగా చాలా దినాలు గడచాయి. తరువాత ఒక నాడు మణక్కాల్ నంబి ఆ కూర తీసుకుని రావడం మానివేశారు. ఆనాడు భోజనంలో తమకు చాలా ఇష్టమైన ఉస్తి కూర లేకపోవడం గమనించి దానికి కారణాలు యామునులు వంటవానిని అడిగారు. ప్రతి దినం కూరను తీసికొని వచ్చే వ్యక్తి ఈనాడు రాలేదు–అని వంటవాడు సమాధానం చెప్పాడు. ఇంత కాలం తమ కోసం తమకు ఇష్టమైన కూరను తీసుకుని వచ్చేవారిని ఒకసారి చూడాలి అని యమునులకు తోచింది. మరునాడు కూర తీసుకొని వచ్చిన నంబిని వంటవాడు యామునుల దగ్గరకు తీసుకొని వెళ్ళాడు. అప్పుడు యామునులు "ఎందుకు మీరు ఈ విధంగా నాకు నాకు ఇష్టమైన ఈ కూరను తీసికొని వచ్చారు? అని అడిగారు. అప్పుడు నంబి "ఈ కూరను ఇంత భోగ్యంగా భావించి మీరు చాలా ఇష్టంగా భుజించారు. అయితే ఇంతకంటే భోగ్యమైన వస్తువు ఒకటి నా దగ్గర ఉన్నది. అది మీ సంతతికి పరంపరగా వస్తున్నది. మీ తాతగారు దానిని మీకు అందజేయమని నాకు అప్పగించారు – అని అన్నారు. ఆ మాటను వినగానే యామునులకు ఆ అపూర్వమైన వస్తువు ఏదో తెలిసి కోవాలి అనే కుతూహలం కలిగింది. తరువాత నంబి వారికి వేదాంత ఙ్ఞానాన్ని ఉపదేశించి తమకు తమ ఆచార్యులు విధించిన ఆఙ్ఞను పూర్తి చేయగలిగారు.

## మణ క్కాల్ నంబి తమ ప్రయత్నంతో యామునులను సంస్కరించడం క్రమమేనా?:

ఇక్కడ కొన్ని సందేహాలు తల ఎత్తుతున్నాయి. "ముందు శిష్యుడు ఆచార్యుని కోసం ఉపహారాన్ని సమర్పించాలని శాస్త్రాలు విధిస్తున్నాయి కదా. మరి ఆచార్యుడైన నంబి కాబోయే శిష్యులైన యామునులకు ఉస్తికూర ఉపహారంగా ఇవ్వడం ఏ విధంగా సంగతం? అంతేకాక, శిష్యుడు ఆర్తితో ఉపదేశాన్ని పొందాలని ఆచార్యుని దగ్గరకు వచ్చి ప్రార్థించాలి కదా. ఇక్కడ నంబి యామునులకు కూర ఇవ్వడం ద్వారా ప్రయత్నించి వారికి ఆశ కల్గించడం తగునా? అంతేకాక, చాలా కాలం పరీక్షించి యోగ్యతను గమనించిన తరువాత కదా ఆచార్యుడు శిష్యునకు ఉపదేశం చేయాలి–అని శాస్త్రం తెలుపుతున్నది. మరి, ఏ పరీక్ష చేయకుండానే నంబి యామునులను తమ శిష్యులుగా స్వీకరించడం తగినదేనా?" అనేవి ఇక్కడ కలిగే ప్రశ్నలు.

వీనికి తగిన సమాధానాన్ని ఈ విధంగా చెప్పవచ్చు. తమకు ప్రాచార్యులైన నాథమునులు సంతతికి ఏదైనా ఒక చిన్న కైంకర్యాన్ని త్వరగా చేయాలి అని నంబి ఆశపడ్డారు. అంతేకాక, ఆచార్యులైన ఉయ్యక్కొండార్ వారి ఆచార్యులైన నాథమునులు నియమనాన్ని పూర్తి చేయలేక వైకుంఠాన్ని చేరారు కదా. వయసు మీరిన తమకు కూడా ఆ రీతిలోనే ఆచార్యాజ్ఞను పూర్తి చేయలేక పోయే పరిస్థితి ఏర్పడుతుందేమో! అనే భయం నంబికి బాగా కలిగింది. ఈ స్థితిలో రాజ భోగాలను అనుభవించే యామునులు తమకు ఉపహారాన్ని సమర్పించి తమ దగ్గరకు రావాలని కానీ, బ్రహ్మ దేశాన్ని పొందాలనే ఆశతో వారే మొదట స్వయంగా తమ దగ్గరకు రావాలని కానీ ఎదురుచూడడం ఉపయోగం లేదు–అని నంబికి తోచింది. అందుచేత ప్రభువువంటి యామునులను సమీపించడానికి కూరను సాధనంగా చేసుకొని తామే స్వయంగా వారి దగ్గరకు పోయి వారికి ఆశను నంబి కలిగించారు. అంతేకాక,

సన్మార్గంలో నడిచేవారు అరుదుగా లభించే ఈ కలికాలంలో శాస్త్ర క్రమంలో చాలాకాలం పరీక్షిస్తే ఉపదేశాలు పొందే యోగ్యత కల శిష్యుడు దొరకడం కష్టమైపోతుంది. ఇంతే కాక, ఈ యుగంలో ఆచార్యుడు శిష్యునకు మంచి మాటలను మాటిమాటికి పలికి ఉపదేశాన్ని పొందాలనే ఆశను అతనికి కలిగించాలి. ఈ విషయాలన్నీ ఈ కలియుగ ధర్మాలు – అని శాస్త్రాలు తెలుపుతున్నాయి. వీనిని అన్నిటినీ దృష్టిలో పెట్టుకొని నంబి యామునులను బాగా పరీక్షించాలి–అనే నియమాన్ని పాటించకుండా త్వరగానే ఉపదేశించి వారిని శిష్యులుగా చేసికోవడం తగినదే.

**యామునులు తమ స్తోత్రంలో తమ ఆచార్యు లైన నంబిని ప్రస్తావించకపోవడం యుక్తమా?:**

యామునులు తాము అనుగ్రహించిన స్తోత్రరత్నం లోని మొదటి మూడు శ్లోకాలలో నాథమునులను కీర్తించిన తరువాత స్తోత్రాన్ని ఆరంభం చేశారు. చివరలో కూడా నాథమునులు సంబంధాన్ని స్మరిస్తూ వారి సంబంధాన్ని చూచి, తమను అనుగ్రహించమని భగవానుని ప్రార్థించారు. స్తోత్రంలో కూడా వారిని పురస్కరించుకొని భగవానుని శరణాగతి చేశారు. ఇక్కడ తమకు ఆచార్యులైన నంబిని కానీ, వారి ఆచార్యులైన పుండరీకాక్షులను కానీ కీర్తించలేదు. వారిని పురస్కరించుకొని ప్రపత్తి చేయలేదు. దీనికి ఏమి కారణం? అనే ప్రశ్న కలుగుతుంది. దీనికి మూడు విధాలుగా సమాధానాల్ని చెప్పవచ్చు.

1) యామునులు నాథమునులను కీర్తిస్తే అది వారి ఆచార్యుల కైంకర్యం చేసినట్లే అవుతుంది. ఆచార్య కైంకర్యం అంటే ఏమి? ఆచార్యులు మనసుకు ఆనందాన్ని కలిగించే సేవే కదా. తమకు సాక్షాత్ ఆచార్యులైన నంబి మనసు, వారికి ఆచార్యులైన

ఉయ్యక్కొండార్ మనసు ఆనందించే రీతిలో సేవ చేయడం అంటే వారి ఆచార్యులైన నాథమునులను కీర్తించడంకంటే వేరు సేవ ఏముంటుంది? అందువల్ల యామునులు నాథమునులను పొగడి, వారిని పురస్కరించుకొని శరణాగతి చేయడం ఆచార్యులకు కైంకర్యం చేసినట్లే అవుతుంది.

2) తమ మనుమలైన నాథమునులు రాజభోగాలు అనుభవించేటప్పుడు వారికి బ్రహ్మ జ్ఞానం ఉపదేశించడానికి ఇష్టపడని నాథమునులు వారికి అందులో శ్రద్ధను కలిగించి వారు ప్రార్థించినపుడే ఉపదేశించండి–అని పుండరీకాక్షులను నియమించారు కదా. అటువంటి వారి అజ్ఞను అనుసరించి కదా పుండరీకాక్షులు నంబిని ఆజ్ఞాపించి వారి ద్వారా యామునులను సంస్కరించిన జేశారు. ఇటువంటి గొప్ప ఆచార్యులను కీర్తించడం ఒక గొప్ప సంపద కదా. దీనివల్ల జ్ఞానం, కైంకర్యం, మోక్ష సామ్రాజ్యం మొదలైన సంపదలు అన్నీ పొందబడుతున్నాయి కదా. ఈ సంపదలు అన్ని పొందడానికి కారణం తాము నాథమునుల వంశంలో జన్మించడమేకదా. వారి తిరుమేనితో కల సంబంధంవల్ల కదా పౌత్రుల విషయంలో నాథమునులకు అంతటి శ్రద్ధ కలిగింది. అందువల్ల అటువంటి నాథమునులను కీర్తించడం యమునుల కర్తవ్యం కదా.

3) సాక్షాత్ ఆచార్యులను ఏ విధంగా సేవించాలో వారి విషయంలో ఎటువంటి కృతజ్ఞతను కలిగి ఉండాలో అటువంటి సేవను, కృతజ్ఞతను పరమాచార్యుల ఈ విషయంలో, వారి ఆచార్యుల విషయంలో కలిగి ఉండాలి –అనేది శాస్త్రసిద్ధం. దీనిని అనుసరించే యామునులు

కృతజ్ఞతలతో ఆరంభించి, నాథమునులను కీర్తించి, ఈ ఈ శాస్త్రార్థాన్ని లోకానికి ఉపదేశించారు.

**గ్రంథకర్తలు కొందరు ఆచార్యులను కొందరిని మాత్రం పేర్కోవడం సంప్రదాయమే:**

కొందరు పెద్దలు తాము గ్రంథ రచన చేసేటప్పుడు శ్రీ యామునులు అనుసరించిన ఈ క్రమంలోనే కొందరు ఆచార్యులను మాత్రం పేర్కొని, వారిని స్తుతించి తమకు సాక్షాత్ ఆచార్యులైనవారిని కూడా ఆ గ్రంథంలో ప్రస్తావించకుండా ఉండే క్రమం కూడా కనిపిస్తుంది. దీనిని బట్టి వారు తమ ఆచార్యుల విషయంలో కానీ, వారు ప్రస్తావించకుండా విడిచిపెట్టిన ఆచార్యుల ఈ విషయంలో గాని భక్తి శ్రద్ధ లేవని, కృతజ్ఞత లేదని భావించడం తగదు. ఆచార్య పరంపరలో కొందరు ఆచార్యులు తాము గ్రంథాలను రచించడం ద్వారా లోకానికి గొప్ప ఉపకరాన్ని చేసినవారు కావడంచేత,వారిని మాత్రం తమ గ్రంథంలో పేర్కొని స్తుతించే పద్ధతి ఉన్నది. ఇంత మాత్రంతో వారు నిలువలేదు. మిగిలిన ఆచార్యులకు కూడా తనియన్ లను రచించడం ద్వారా వారిని కీర్తించారు. ఈ విధంగా ఎవరిని విడువకుండా ఆచార్యులు అందరిని కృతజ్ఞతతో అనుసంధించారు.

**శ్రీరామానుజులకు పెరియ నంబియే (మహాపూర్ణులే) ఆచార్యులు:**

భగవద్రామానుజులు శాస్త్రాలను చక్కగా అభ్యసించి మేధావియై, కాంచీపురంలో ఉన్నారు. వారి యోగ్యతను గూర్చి కర్ణాకర్ణిగా విన్న శ్రీ యామునులు వారికి తాము స్వయంగా వేదాంత గ్రంథాలను ఉపదేశించాలని ఆశపడ్డారు. శ్రీరంగంలో ఉండే యామునులు తమ ప్రధాన శిష్యులైన పెరియ నంబిని పిలచి కాంచీపురానికి వెళ్లి రామానుజుల తీసుకొని రమ్మని అన్నారు.

పెరియ నంబి కూడా ఆ విధంగా కంచికి వెళ్లి రామానుజులను తీసుకొని శ్రీరంగానికి బయలుదేరారు. వారిద్దరూ శ్రీరంగానికి చేరే సమయానికి యామునాచార్యులు పరమపదానికి చేరారు. భగవద్రామానుజులకు వేదాంత గ్రంథాలను ఉపదేశించమని తమ మాటగా చెప్పవలసినదిగా తమ అంతరంగ శిష్యులైన వారికి తెలియజేసి యామునాచార్యులవారు పరమపదానికి చేరారు. వారి అజ్ఞను అనుసరించి పెరియ నంబి భగవద్రామానుజులకు సకల సంప్రదాయార్థాలను ఉపదేశించి, వారికి ప్రధానాచార్యులు అయ్యారు.

**ఇంకా మరికొన్ని ఉపదేశాల కోసం రామానుజులు అన్వేషించడానికి కారణం:**

పెరియ నంబి శ్రీ భాష్యకారులకు సకలార్థాలను ఉపదేశించిన ప్రధానాచార్యులై ఉండగా తమతో పాటు మరి కొందరు ఆచార్యుల సన్నిధిలో శ్రీరామానుజులను ఉపదేశాన్ని పొందమని నియమించడం ఎందుకోసం? అనే సందేహం ఇక్కడ కలుగవచ్చు. దీనికి తగిన సమాధానం ఏమి అంటే, ఒకరి వద్ద ఉపదేశ రూపంగా పొందిన అర్థాలను పలువురు పెద్దల సన్నిధిలో పలు రీతులలో వినాలి–అనే శాస్త్రక్రమాన్ని అనుసరించి, తమ శిష్యులైన శ్రీరామానుజులను పలు విధాలుగా సంస్కరించాలి అనే అభిప్రాయంతో శ్రీ భాష్యకారులను ఆ విధంగా పెరియ నంబి నియమించారు. ఈ రీతిలోనే పెద్దల అనుష్ఠానం కూడా కనిపిస్తుంది. "బహుభ్యః శ్రోతవ్యం, బహుధా శ్రోతవ్యమ్", "జ్ఞానవృద్ధా మయా రాజన్! బహవః పర్యుపాసితాః" ఇత్యాది ప్రమాణాల భావం ఇక్కడ స్మరణీయం. వ్యాస భగవానుడు తన పుత్రుడైన శుకునకు తాను అన్ని అర్థవిశేషాలను ఉపదేశించిన తరువాత, ఆ అర్థాలు స్థిరంగా అతని మనసులో నిలవడం కోసం మిథిలా నగరంలో ఉండే బ్రహ్మజ్ఞాని అయిన జనకుని దగ్గరకు

పోయి ఇంకా మళ్ళీ కొన్ని ఉపదేశాలను పొందమని ఆజ్ఞాపించాడు. అందువల్ల పెరియ నంబి భాష్యకారులను ఆ విధంగా అజ్ఞాపించడం తగినదే.

**పలువురు ఉపదేశకులు ఉండవచ్చునని ఉపనిషత్తు తెలిపే వృత్తాంతం**:

ఈ విధంగా ఒకనికి పలువురు ఆచార్యులు ఉండే ఆచారాన్ని ఉపనిషత్తులలోని పలు సందర్భాలలో గమనించవచ్చు. ఉదాహరణకి – జీవాత్మ, పరమాత్మ లకు సంబంధించి తెలియవలసిన శాస్త్ర విషయాలను ఉపకోసలుడనేవానికి ముఖ్యమైన బ్రహ్మ స్వరూపాన్ని, అంగమైన అగ్నివిద్యనుగూర్చి,అగ్నులు ఉపదేశించాయి. బ్రహ్మ స్వరూపానికి సంబంధించిన మిగిలిన ముఖ్యమైన విశేషాలను, అంగమైన అర్చిరాది గతి మొదలైన విషయాలను ఉప కోసలునకు ఆచార్యుడు ఉపదేశించాడు. ఈ వృత్తాంతాన్ని ఛాందోగ్యం తెలుపుతున్నది. ఒకనికి పలువురు ఆచార్యులు బ్రహ్మ విద్యను ఉపదేశించే క్రమం పూర్వకాలం నుండి ఉన్నదని తెలుస్తున్నది.

**ఒకే ఆచార్యుని పలువురు అన్వేషించడం**:

కొందరికి ఇంకొక ఆచార్యుని అన్వేషించవలసిన అవసరం లేని రీతిలో ఒకే ఆచార్యుని సన్నిధిలోనే సకల శాస్త్ర గ్రంథాలను ఉపదేశంగా పొందే భాగ్యం కూడా కొందరికి కలుగుతుంది. శ్రీ పరాశర భగవానుని వద్ద మైత్రేయుడు తెలియవలసిన అర్థాలను ఉపదేశ రూపంగా పొందడం వల్ల అతనికి ఆయనకు వేరొక ఆచార్యుని వెదుక వలసిన ఆవశ్యకత లేకపోయింది. వ్యాసభగవానుడు కూడా ఒకే ఆచార్యుని ఆశ్రయించి అన్ని అర్థాలను విన్నాడని తెలుస్తున్నది. మన ఆచార్య పరంపరలో నాదములు మొదలైన కొందరు ఆచార్యులు ఒకే

ఆచార్యుని ఆశ్రయించారని వింటున్నాము. వీటిని బట్టి ఒకే ఆచార్యుని సన్నిధిలోనే అన్నిటిని గ్రహించాలి అని కానీ, లేక, పలువురు ఆచార్యులను ఆశ్రయించి బ్రహ్మవిద్యను అధికరించాలి – అని కాని నియమం ఏమీ లేదు – అని స్పష్టమవుతున్నది. ఏ విధంగా అయినా జ్ఞాన సంపాదన వేయడం అనేది చాలా ఆవశ్యకమైనది. అందులకు తగినట్లు ఒక ఆచార్యుని ఆశ్రయించవచ్చు. లేక, అవసరమైతే పలువురు ఆచార్యులను ఆశ్రయించవచ్చు.

**మిగిలిన ఉపదేశకులు కూడా ఆచార్య శబ్ద వాచ్యులే*:***

ఒక ఆచార్యుని ప్రధానునిగా గ్రహించి వారి సన్నిధిలో తత్త్వ హిత పురుషార్థాలను ఉపదేశంగా పొందినవాడొకడు ఆ అర్థాలను తన మనస్సులో నిలుపుకోవడం కోసం పలువురు పెద్దల దగ్గరకు వెళ్లి వారి దగ్గర తెలియదగిన అర్థాలను విని మనసును తేటపరచుకొన వచ్చును. ఆ ఉపదేశకులను కూడా తన ఆచార్యులుగా భావించడం అతని కర్తవ్యం. శాస్త్రం కూడా ఒక ఆచార్యుని వద్ద విని తెలిసికొన్న అర్థాలను స్థిరంగా మనసులో నిలుపుకోవడం కోసం ఇంకొక మహనీయుని వద్ద వానిని వినాలని,అతడు కొంచెంగా ఉపదేశించినా, లేక, ఎక్కువగా ఉపదేశించినా అతని సహాయాన్ని తలచి, ఆ మహనీయుని కూడా గురువుగా భావించాలి – అనే విషయాన్ని “అల్పం వా బహు వా యస్య శ్రుతస్యోపకరోతి వా, తమపీహ గురుం విద్యాత్ శ్రుతోపక్రియయా తయా" ఇత్యాది ప్రమాణాలు తెలుపుతున్నాయి.

**పలవురు ఆచార్యులలో ప్రధానాచార్యులు ఎవరు*?:***

ఈ విధంగా ఒకనికి పలువురు ఆచార్యులు ఉండడం సంభవిస్తే వారి అందరి పట్ల అతడు సమానమైన భక్తిని కలిగి ఉండాలా? లేక, భక్తిలో తేడా ఉంటుందా? అనే సందేహం

కలిగినప్పుడు, ఈ క్రింది సమాధానాన్ని చెప్పుకోవచ్చు. మోక్షాన్ని పొందడానికి భక్తియోగం ప్రపత్తియోగం – అనేవి రెండు సాక్షాత్ ఉపాయాలు. చేతనుడు ఏదైనా ఒక ఉపాయాన్ని ఆచరించకపోతే అతనికి మోక్షప్రాప్తి కలుగదు. తన యోగ్యతకు తగినట్లు ఏదో ఒక ఉపాయాన్ని అతడు ఆచరించాలి. వీటిలో ఒక ఉపాయాన్ని ఆచరిస్తే తరువాత మోక్షానికి సాధారణంగా ఇక దేనిని ఆచరించవలసిన అవసరం అతనికి లేదు. అందువల్ల ఈ రెండు మోక్షానికి నేరుగా ఉపాయాలు అవుతున్నాయి. దీనిని గూర్చి విశదంగా ఉపదేశించే వాడే ప్రధానుడునైన ఆచార్యుడు. అనగా– తిరు మంత్రం, ద్వయం, చరమ శ్లోకం అనే మూడు రహస్యాల అర్థాలను వివరించడం ద్వారా భగవానుని స్వరూపం, దానికి తగిన ఫలమైన మోక్షం–అనే వీటిని గూర్చి వివరంగా ఉపదేశించి, మోక్షంలో కోరికను కలిగించి, దానికి సాధనాలైన భక్తి ప్రపత్తులలో శిష్యుని యోగ్యతను బట్టి ఒక ఉపాయంలో అతనికి నిశ్చయమైన జ్ఞానం ఏర్పడేటట్లు విశదంగా ఉపదేశించడమే ప్రధానుడైన ఆ ఆచార్యుని కర్తవ్యం. ఈ విధంగా ఉపదేశించిన వాడే ప్రధాను డైన ఆచార్యుడు. ఇతని పట్ల శిష్యుడు కలిగి ఉండవలసిన భక్తి అపరిమితంగా ఉండాలి.

**సహాయకులైన ఆచార్యుల కర్తవ్యం***:*

ఈ విధంగా ఉపదేశం ద్వారా ప్రధానాచార్యుని వల్ల ఉపాయాలను గూర్చిన నిశ్చయమైన జ్ఞానాన్ని సంపాదించినప్పటికీ, కొందరికి విధి వశం చేత ఆ నమ్మకం సడలి పోవచ్చు. కానీ, దానికి ఏమాత్రం అవకాశం ఈయకూడదు. ఉపాయాలను ఆచరించినంత మాత్రంలో చాలదు. ఉపాయాలకు అంగాలు ఉన్నాయి కదా. వానినికూడా చక్కగా పూర్తి చేయవలసి ఉన్నది. దానికి కావలసిన జ్ఞానాన్ని సంపాదించాలి. ఈ విషయాలను అన్నిటినీ ప్రధానాచార్యునివల్ల పొందే అవకాశం

కొందరికి లేకపోవచ్చు. అటువంటి సందర్భంలో ప్రధానుడైన ఆచార్యుడు మెచ్చినవారైన పెద్దలను కొంతమందిని అన్వేషించాలి. వారు ఇతనికి ఉపాయాలను గూర్చిన నమ్మకం సడలకుండా ఉండేటట్లు, వాటి అంగాలను పూర్తి చేయడానికి కావలసిన విషయాలలో స్పష్టత, జ్ఞానం కలిగేటట్లు విస్తరంగా ఉపదేశించి సంస్కరించడం ఆ సహాయకులైన ఆచార్యుల కర్తవ్యం. ఇటువంటి వారు ఆచార్యాభిమతశిక్షకాంతరులు (ఆచార్యుడు మెచ్చిన వేరు శిక్షకులు). కానీ, వీరు ప్రధానాచార్యుల పరంపరలోకి చేరరు.

**ఆచార్యులను ఆశ్రయించడానికి సహాయపడిన వారినికూడా ఆదరించడం:**

ఈ విధంగా చేతనుడు తరించడానికి ముఖ్యంగా అవసరమైన ఆచార్య సంబంధాన్ని అతడు పొందడానికి కొన్ని కారణాలుంటాయి. తాను తరించడానికి తగిన దారిని అతడు అన్వేషించకుండా ఈ లోకంలోని సుఖాలలో మునిగి, తిరిగే ఈ జీవునకు అతని సత్కర్మవశం చేత కొందరు సాత్వికులైన మహనీయులతో సంభాషించే అవకాశం కలుగుతుంది. వారు ఇతనికి కొన్ని మంచి మాటలు చెప్పవచ్చు. వానిని వినడం వల్ల ఇతడు సంస్కరించబడి, ఒక సదా చార్యుని కోసం వెదకి సద్గతిని పొందవచ్చు. ఈ విధంగా సదాచార్య సంబంధాన్ని పొందడానికి తగినట్లు సన్మార్గంలో తనను తీసుకుని వచ్చిన ఆ మహనీయులైన సాత్వికులచే సంస్కరించబడిన చేతనుడు వారిపట్ల చాలా గౌరవంగా వ్యవహరించాలి.

**గ్రంథాలను అనుగ్రహించినవారిని ఆదరించడం:**

ఇంతేకాక, కొందరు పెద్దలు తన ఆచార్య పరంపరలో చేరకపోయినా, సిద్ధాంతవిషయాలను గూర్చి తామే స్వయంగా

కొన్ని నూతనమైన గ్రంథాలను రచించి గాని, పూర్వాచార్య గ్రంథాలకు విస్తృతమైన వ్యాఖ్యానాలను రచించి గాని సహాయ పడవచ్చు. వారు నేరుగా తనకు జ్ఞానాన్ని ఉపదేశించి సహాయం చేయకపోయినా గంథాలను రచించడం ద్వారా పరంపరగా సహాయ పడినవారే. ఉదాహరణకు – శ్రీ భాష్యానికి అద్భుతమైన వివరణ అయిన శ్రుతప్రకాశికను అనుగ్రహించిన శ్రీ సుదర్శన సూరి, శతదూషణి అనే గ్రంథానికి అటువంటి చక్కని చండ మారుతం అనే వ్యాఖ్యానాన్ని రచించిన దొడ్డయాచార్యస్వామి మొదలైనవారు ఇటువంటివారు. ఈ మహనీయులను, వారు మనకు అందించిన గ్రంథాలను, వారు మనకు చేసిన మహోపకారాన్ని తలచి, గౌరవించడం మన కర్తవ్యం.

**భగవానుడు అందరిలోనూ ప్రధానుడైన ఆచార్యుడు:**

పూర్వం తెలిపిన ప్రధానాచార్యులు, ఉపకారకాచార్యులు, పరంపరగా సహాయపడిన మహనీయులు మొదలైన అందరికంటే చాలా ముఖ్యమైన ఆచార్యుడు ఒక్కడే. అతడు శ్రియఃపతి అయిన భగవానుడే. అతడే ఆచార్యుడు మొదలైన మహనీయులు అందరిలో ప్రవేశించి అంతర్యామిగా నిలచి ఉండి, వారిని శిష్యులకు ఆ విధంగా సహాయం చేయడంలో ప్రోత్సహిస్తూ ప్రేరేపిస్తాడు. అతడు ఒక్కడే ఆచార్య పరంపరలో ఆచార్యులు అందరికంటే గొప్పవాడైన పరమాచార్యుడు. అతనికి ఆచార్యుడు ఇంకొకడు లేడు. ఈ సర్వేశ్వరునితోనే ఆచార్య పరంపర పూర్తి అవుతున్నది, ఆరంభం అవుతున్నది కూడా.

**భగవద్రామానుజుల శిష్యులలో సిద్ధాంతవిషయాలలో భేదం ఏమీ లేదు:**

ఈ విధంగా భగవానునితో ఆరంభమై శ్రీ రామానుజుల వరకు ఉండే సంప్రదాయ క్రమం ఈ విధంగా ఉన్నది.

భగవానుడు,లక్ష్మీదేవి, విష్వక్సేనుడు, నాథమునులు, పుండరీకాక్షులు, శ్రీరామమిశ్రులు,పెరియ నంబి, శ్రీ భాష్యకారులు – అని ఆచార్య పరంపర కొనసాగుతున్నది. శ్రీ భాష్యకారుల తరువాత వారి వేరు వేరు శిష్యుల ద్వారా సంప్రదాయం విభిన్నశాఖలుగా అభివృద్ధి చెంది వ్యాపించింది. ఈ విధంగా విస్తరించిన సిద్ధాంతానికి ముఖ్యమైన విషయాలలో మాత్రం వేరు వేరు శాఖలలో వైమత్యం మాత్రం లేదు. తిరు మంత్రం, ద్వయం, చరమశ్లోకం అనే రహస్యాలలోని అర్థాలను చెప్పడంలో, పదాలను అన్వయించి వాక్యాలను కూర్చడంలో కొన్ని కొన్ని తేడాలు కలిగాయి. ఇంత మాత్రంతో సంప్రదాయానికి చెందిన ముఖ్యమైన అంశాలలో వారి మధ్య భేదం ఏర్పడిందని భావించరాదు.

**ఈ సంప్రదాయంలో అనుష్ఠానభేదం శాస్త్ర సమ్మతమే:**

ఈ విధంగా భగవద్రామానుజుల సంప్రదాయానికి చెందిన ఆస్తికులైనవారి అనుష్ఠానాలలో కొన్ని కొన్ని తేడాలు కనపడవచ్చు. దేశాలకు తగినట్లు కానీ, ఆయా కాలాలకు తగినట్లు కానీ, ఆయా సమయాలలో ఏర్పడిన సమస్యలకు తగినట్లు కానీ అనుష్ఠానాలలో తేడాలు ఏర్పడినా, అవి శాస్త్రాలకు అనుగుణమైనవే అవుతాయి.

**తరువాతి కాలానికి చెందినవారు నూతనమైన సిద్ధాంతాన్ని కల్పించడం తగదు:**

భగవద్రామానుజులకు తరువాత కొందరు తమకు ఇష్టం వచ్చిన రీతిలో శాస్త్రవిరుద్ధాలైన వాదాలను లేవనెత్తి, "శ్రీరామానుజుల మనసుకు ఇవి అనుగుణమైనవి" అని "వీటిని రామానుజులే ప్రవచించారు" అని అంటున్నారు. వారు శ్రీరామానుజుల శ్రీసూక్తులను, ఆచరణను సరిగా అర్థం

చేసికొన్నవారు కాదని అనాలి. వారు కల్పించిన వాదాలను, ఆచరణలను శ్రీ రామానుజులపై ఆరోపించడంవల్ల ఆచార్యవర్యులకు ఏ దోషం కలుగదు. ఆ విధంగా ఆరోపించేవారికే అవద్యం. మాండవ్యముని దగ్గర లేని దోషాలను ఆ మునిపై ఆరోపించిన దొంగలకే పాపం కలిగినట్లే, ఇది కూడా.

**అష్టాక్షరీ మంత్రార్థంలో ఏ వైషమ్యం లేదు:**

ఇక, తిరుమంత్రం, ద్వయం, చరమ శ్లోకం అనే 3 రహస్యాలను గూర్చి కలిగే కొన్ని సందేహాలు, వానికి సమాధానాలు తెలుపబడు తున్నాయి. అష్టాక్షరీ అనబడే తిరుమంత్రంలో ఉండే ఒక్కొక్క పదాల అర్థాలు, ఆ పదాలను కూర్చి వాక్యంగా చేసి చెప్పే అర్థాలు పలు విధాలుగా చెప్పబడుతున్నాయి. దీనివల్ల ఆ అర్థాలలో పరస్పర వైషమ్యం ఉన్నదని భావించరాదు. ఆ విధంగా అనేక విధాలుగా చెప్పబడే పలు అర్థాలు ఒకదానితో ఇంకొకటి సంబంధాన్ని కలిగినవే. అందువల్ల సామ్యమేకానీ వైషమ్యం లేదు. ఆ విధంగా పలు విధాలుగా అర్థాలను చెప్పడానికి ఆధారంగా నిరుక్తం అనే వైదికనిఘంటువు ఉన్నది. దానిని బట్టి, ఇంకా, వేదాలు, స్మృతులు, పాంచరాత్రం, ఇతిహాసాలు, పురాణాలు, దివ్య సూరుల సూక్తులు మొదలైన వానిలోని విశేష వాక్యాలను బట్టి అటువంటి అర్థ విశేషాలు చెప్పబడుతున్నాయి.

**తిరుమంత్రం లో మూడు విధాలుగా ఉండే అర్థ పంచకం:**

తిరుమంత్రం లో మూడు పదాలున్నాయి. ఈ మూడు పదాలు అర్థ పంచకం తెలుపుతున్నవి అనే ఒక వివరణ ఉన్నది. ఆ విధంగానే మొదటి పదమైన ప్రణవం తోనే అర్థ పంచకం చెప్పబడుతున్నది అనే అన్వయం కూడా ఉన్నది. ఈ విధంగానే, మొదటి అక్షరమైన 'అ' కారం చేతనే అర్థ పంచకం తోస్తున్నది అని కూడా చెప్పడం ఉన్నది. ఈ రీతిగా మూడు విధాలుగా అర్థ

పంచకం చెప్పబడినా, ఇవి ఒకదానికి ఇంకొకటి విరుద్ధం కాదు. ఎందుకంటే – కొన్ని అర్థాలను ఆయా పదాలు సహజంగా తెలుపుతున్నాయి. మరికొన్ని అర్థాలు ఆ ఆ పదాల వల్ల తోస్తున్నాయి. కొన్ని అర్థాలు చాల సూక్ష్మంగా తోస్తున్నాయి. మరికొన్ని విశదంగా వ్యక్తమవుతున్నాయి అందువల్ల ఈ అర్థాల మధ్య వైరుధ్యం ఉందని భావించరాదు.

## ప్రణవంలో లక్ష్మీదేవి:

తిరు మంత్రంలోని ప్రణవంలో భగవానుని చాలా స్పష్టంగా తెలిపే అక్షరమైన 'అ'కారమే లక్ష్మీదేవినికూడా సూక్ష్మంగా సూచిస్తున్నది. ఆ విధంగానే రెండవ అక్షరమైన 'ఉ'కారం కూడా లక్ష్మీదేవిని స్పష్టంగా తెలుపుతున్నది. ఇందులో వైరుధ్యం కానీ, ఒకే అర్థాన్ని రెండుసార్లు చెప్పడం అనే పునరుక్తి అనే దోషం కాని లేదు. 'అకారం అందరిని రక్షించే భగవానుని తెలుపుతున్నది. కానీ, అతడు లక్ష్మీసహితుడై రక్షణ చేస్తాడని ప్రమాణాలు తెలుపుతున్నాయి. భగవద్రామానుజులు కూడా భగవానుని మాత్రం నిర్దేశించే పదాలన్నీ లక్ష్మీ సహితుడైన భగవానుని నిర్దేశిస్తాయి అని తెలిపారు. అంతేకాక, లక్ష్మీదేవి సదా భగవానునితో కలసి నిత్యానపాయిని గా ఉండడంవల్ల భగవానుని ప్రత్యేకంగా వేదం నిర్దేశించలేదు – అని భట్టర్ కూడా అన్నారు. ఇది తాత్పర్యార్థం. ఈ విధంగా గ్రహించేటప్పుడు ప్రణవంలోని రెండవ అక్షరమైన ఉకారానికి అవధారణార్థం చెప్పాలి, ఇక్కడ అవధారణం అంటే ఒకనికే చెందినవాడై ఉండడం. అనగా –"లక్ష్మీ సహితుడైన భగవానునికి ఈ జీవుడు దాసుడై ఉన్నాడు, వేరొకరికి దాసుడు కాడు"– అనే అర్థం ఇక్కడ ఫలిస్తుంది. ఈ క్రమంలో లక్ష్మీదేవి శబ్దం ద్వారా కాకుండా అర్థం వల్ల, అంటే, తాత్పర్యార్థం ద్వారా సూచింపబడుతుంది.ఈ విధంగా కాకుండా, 'ఉ'కారం లక్ష్మీ వాచకం అనే వాదం ఇంకొకటి ఉన్నది. అనగా –

ప్రణవంలోని రెండవ అక్షరం అయిన 'ఉ'కారం లక్ష్మిని తెలుపుతున్నది–అని ఈ వాదంలోని తాత్పర్యం. వేదమే ఉకారానికి లక్ష్మిని అర్థంగా తెలిపింది. ఈ క్రమంలో భగవానుడు, లక్ష్మీదేవి–అనే ఇద్దరికీ జీవుడు శేషం–అనే విషయం అర్థంవల్ల కాకుండా నేరుగానే చెప్పబడినట్లు అయినది.

**దివ్య దంపతులకు జీవుడు శేషం:**

ఈ క్రమంలో "భగవానుడు, లక్ష్మీదేవి" అనే దివ్య దంపతులు ఇద్దరికీ తప్ప, వేరెవరికీ జీవుడు శేషం కాడు–అనే అర్థం నేరుగా కాకుండా తాత్పర్య రూపంగా ఉన్నది. అంటే–ఏ వాక్యమైనా వేరెవరిని చెప్పకుండా ఒక్కరిని మాత్రమే నిర్దేశిస్తే, అందులో ఒక్కరికి మాత్రమే సంబంధం ఉన్నదని, ఇక వేరెవరికీ ఎవరికి సంబంధం లేదని అర్థం ద్వారా వ్యక్తమవుతుంది–అనే న్యాయం సంస్కృత భాషలో ఉన్నది. ఈ క్రమంలో ఇక్కడ దివ్య దంపతులు ఇద్దరు మాత్రమే చెప్పబడి, వారికి జీవుడు శేషమని తెలుపబడడంవల్ల, పూర్వం చెప్పబడిన న్యాయాన్ని అనుసరించి, ఇద్దరికీ మాత్రమే జీవుడు శేషం– అనే అర్థం తాత్పర్యం వల్ల సిద్ధిస్తుంది. అందువల్ల రెండు విధాలుగా రక్షకుడైన భగవానునితో ఎల్లప్పుడు కలసి ఉండి లక్ష్మీదేవి కాపాడుతున్నది–అనేది ఇక్కడ అర్థంగా వ్యక్తం కావడంలో విప్రతిపత్తి కానీ, పునరుక్తి కానీ లేదు.

**దివ్య దంపతులు ఇద్దరికీ జీవుడు శేషంగానే ఉన్నాడు:**

ఇంతేకాక, దివ్య దంపతులు ఇద్దరికీ మాత్రమే జీవుడు శేషం అనే అర్థం నేరుగా ఏర్పడినట్లే, ఆ ఇద్దరికీ జీవాత్మ శేషమై ఎల్లప్పుడు ఉంటాడు అనే నియమం కూడా ఏర్పడుతుంది. ఈ రెండవ నియతి వల్ల ఎల్లప్పుడూ భగవానునకు జీవుడు శేషమై ఉంటాడు. భగవానుడు జీవునకు ఆత్మయై ఉంటాడు అనే

శరీరాత్మభావం చెప్పబడినట్లు అయినది. సదా ఒకరికి శేషం గా ఉండడం అనేది శరీర లక్షణం కదా. జీవునకు అతని శరీరం సదా శేషమై ఉంటుంది. దానిని అతనికి శరీరమని చెప్పడం ప్రసిద్ధమే కదా.

**జీవులను నిర్దేశించే సామాన్యవాచకం(‘మ’కారం) జీవవిశేషాన్ని నిర్దేశించే క్రమం:**

ప్రణవంలోని మూడవ అక్షరమైన ‘మ’కారం జీవకోటిని నిర్దేశిస్తుంది. అందువల్ల అది జీవసామాన్య వాచకం. ఈ విధంగా అయితే సామాన్యంగా జీవులను అందరిని నిర్దేశించే ఈ ‘మ’కారంతో "నేను దివ్య దంపతులు ఇద్దరికీ శేష భూతుడను" అని తనను మాత్రం విడదీసి ఏ విధంగా అనుసంధించడానికి వీలవుతుంది? అనే సందేహం కలుగవచ్చు. దీనికి సమాధానం ఏమంటే–జీవుడు తిరుమంత్రంతో తన స్వరూపాన్ని గ్రహించి, దానికి తగిన ఫలాన్ని కోరి, అందుకు తగిన ఉపాయాన్ని చేయవలసినవాడై ఉన్నాడు. అందువల్ల ఇతడు గమనించి తన రూపాన్ని తప్పక అనుసంధించాలి. అందుచేత జీవులందరూ సామాన్యంగా భగవానునకు శేషం అని తెలిసికొన్నా, వారిలో తాను ఒకడు – అనే జ్ఞానంతో తనను గుర్తించి, "నేను ఆ దివ్య దంపతులకు దాసుడను" అని ప్రత్యేకంగా అనుసంధిస్తున్నాడు – అని చెప్పవచ్చు. అందువల్ల ఈ అర్థం, అనగా, తనను దివ్యదంపతులకు దాసునిగా గుర్తించి, ఆ సంబంధాన్ని అనుసంధించడం తాత్పర్యం వల్ల ఏర్పడుతున్నది.

ఇక్కడ ఇంకొక క్రమం కూడా ఉన్నది. ప్రణవంలోని మూడవ అక్షరమైన ‘మ’కారం నేరుగా "నేను" అనే అర్థం తెలుపుతున్నది. "నేను" అనే అర్థాన్ని చెప్పే అస్మత్ శబ్దం యొక్క ప్రారంభంలో ఉండే "అస" అనే దానిని చివరలో ఉండే "అత్" అనే దానిని విభజించి చూచినప్పుడు, మధ్యలో ఉండే "మ " అనే

'మ'కారమే "నేను" అనే అర్థాన్ని తెలుపుతున్నది – అని తలచే వారు కూడా ఉన్నారు. అందుచేత, "నేను ఆ దివ్యదంపతులిద్దరికి దాసుడను" అని ప్రత్యేకంగా అనుసంధించే అవకాశం కలిగింది. లోకంలో ఉండే ప్రతి ఒక్క జీవుడు ఈ విధంగా ప్రత్యేకంగా అనుసంధిచుకోవచ్చు. అందువల్ల, అందరూ దివ్య దంపతులకు దాసులు –అనే అర్థం తాత్పర్య రూపంలో సిద్ధిస్తున్నది. అందుచేత ఈ రెండు రీతులలో 'మ'కారం "నేను" అనే అర్థాన్ని ఇవ్వడంలో ఏ విరోధం లేదు.

**భాగవతశేషత్వమే చరమావధి:**

జీవుడు భగవానునకు దాసుడు – అని తెలిపే ప్రకరణాలలో అంతట "భగవానునకు జీవుడు దాసుడు, భాగవతులకు దాసుడు" అనే పర్యంతం జీవుడు తన స్వరూపాన్ని అనుసంధించుకోవాలి. భగవానునకు జీవుడు దాసుడై ఉండడం – అనే పర్యంతంవరకు పోయినప్పుడే భగవద్దాస్యం పూర్ణం అవుతున్నది. భాగవతులకు కూడా దాసుడయ్యే స్థితియే భగవద్దాస్యంలోని చివరి అవధి

**ప్రణవంలో భాగవత శేషత్వప్రతిపాదనం*:***

ఈ భాగవత శేషత్వాన్ని తిరుమంత్రంలోని మిగిలిన పదాలలో అనుసంధించడం కంటే మధ్యమపదమైన "నమః " అనే పదంలో సంధించడం చాలా యుక్తం. ప్రణవంచేత – జీవుడు భగవానునకు శేషం, భగవానుడు జీవునకు స్వామి – అనే పర్యంతం చెప్పబడుతున్నది. స్వామియై ఉండేవాడు తనకు దాసుడై ఉండేవానిని తన ఇష్టానుసారంగా పరచుకునే సంబంధాన్ని కలవాడై ఉంటాడు. స్వామి అయిన భగవానునకు ఏది అభిమతం? అని ఆలోచిస్తే, అతని అంతులేని ప్రేమకు పాత్రమైన భాగవతులకు కూడా దాసుడు కావడమే మిక్కిలి ఇష్టం–

అనేది స్పష్టమవుతుంది. ఈ విధంగా ఓంకారంలో "భాగవతులకు జీవుడు దాసుడు" అనేది తాత్పర్యంగా సిద్ధిస్తున్నది.

**నమఃశబ్దంలోని భాగవతశేషత్వం:**

ఈ విధంగా జీవుడు భాగవతులకు దాసుడు – అనే అంశాన్ని నమః అనే మధ్యమ పదంలో ఇంకా స్పష్టంగా గమనించవచ్చు. నమః అనే పదాన్ని "న, మః" అని 2 పదాలుగా విభజించి, స్వాతంత్ర్యం అనేపదాన్ని అధ్యాహరించుకొని, అర్థాన్ని చెప్పవచ్చు. దీనిచేత "జీవుడను అయిన నేను కొంచెం కూడా స్వాతంత్ర్యాన్ని కలవాడను కాను" – అనే అర్థం వస్తుంది. అందువల్ల జీవుడు తనకు కొంచెం కూడా స్వాతంత్ర్యం లేకుండా భగవానునకు వశమై ఉండాలి – అని తెలుస్తున్నది. దీనివల్ల భగవంతుడు స్వతంత్రుడు అనే నిశ్చయాన్ని జీవుడు పొందుతాడు. ఈ విధంగా ప్రణవం ద్వారా భగవానుడే స్వామి– అని, నమశ్శబ్దంచేత "భగవంతుడే స్వతంత్రుడు"– అని బాగా వ్యక్తం అవడం చేత, ఈ విధంగా దాసుడైన జీవుని తన అభిమానానికి పాత్రులైన భాగవతులకు దాసునిగా చేయడంలో అడ్డు ఏమి ఉన్నది కనుక! జీవుడు కొంచెం కూడా స్వాతంత్ర్యాన్ని లేనివాడై పరమాత్మకు పరతంత్రుడై ఉండే స్థితిని తెలిపే నమశ్శబ్దంలో భాగవతులకు కూడా దాసుడనే అర్థాన్ని అనుసంధించు కోవడం చాలా యుక్తం.

**చతుర్థీవిభక్తిలోని అర్థాన్ని వివరించడం:**

సంస్కృత భాషలో "ఆయ" అనేది చతుర్థీ విభక్తి ప్రత్యయం. ఈ ప్రత్యయానికి "కొరకు" అని అర్థం. ప్రణవంలోని మొదటి అక్షరం ఐన అకారంపై "ఆయ" అనే చతుర్థీ విభక్తి వచ్చి లోపించింది. అయినా, అర్థాన్ని చెప్పేటప్పుడు ఆ ప్రత్యయం ఉన్నట్లుగానే తలచి చెప్పాలి. అందువల్ల "అ+ ఆయ"

అనేదానికి–'అ'కారంచేత నిర్దేశింపబడే భగవానుని కొరకు–అనే అర్థం వస్తుంది. అంటే–జీవుడు అతనికి శేషం–అని తాత్పర్యం. ఈ విధంగానే "నారాయణాయ" అనేటప్పుడు "ఆయ" అనే చతుర్థీ విభక్తి వ్యక్తంగానే ఉన్నది. దానికి కూడా, ముందు చెప్పినట్లే "నారాయణుని కొరకు" అనే అర్థాన్ని చెప్పాలి. అందుచేత ఈ రెండు ప్రత్యయాలు నేరుగా అర్థాన్ని ఇస్తున్నాయి . తిరుమంత్రాన్ని ఒకే వాక్యంగా, రెండు వాక్యాలుగా,మూడు వాక్యాలుగా గ్రహించి అర్థం చెప్పే పద్ధతి కలదు. ఒకే వాక్యంగా చెప్పినప్పుడు దానికి 'అ'కారాన్ని నారాయణ శబ్దానికి విశేషణం చేసి 'అ' కారం చేత చెప్పబడే నారాయణకు నేను శేషం అనే అర్థాన్ని గ్రహించాలి. అప్పుడు 'అ'కారంపై ఉండే చతుర్థీ విభక్తికి ప్రత్యేకమైన అర్థాన్ని చెప్పలేదని గ్రహించాలి. తిరు మంత్రాన్ని 3 పదాలుగా గ్రహించినపుడు, అందులో మొదటి వాక్యం అయిన ప్రణవం జీవుని స్వరూపాన్ని, రెండవ వాక్యం అయిన "నమః" అనేది ఉపాయమైన ప్రపత్తిని తెలుపుతున్నదని, మూడవ వాక్యమైన "నారాయణాయ" అనేది ఫలాన్ని తెలుపుతున్నదని అర్థం చెప్పినప్పుడు, 'అ'కారం పై, నారాయణ పదంపై ఉండే చతుర్థీవిభక్తి ప్రత్యయాలు నేరుగా అర్థాన్ని పూర్వంవలె తెలుపుతున్నాయని గ్రహించాలి. ఎందుకంటే, ప్రణవంలో అకారంపై వచ్చి లోపించిన 'ఆయ' అనే విభక్తి జీవునకు దాస్యాన్ని తెలుపుతున్నది కావడంచేత, నారాయణాయ అనేటప్పుడు ఉండే "ఆయ" అనేదానికి కూడా దాస్యాన్ని అర్థంగా చెప్పడంలో సార్థక్యం ఏమీ లేదు. అంతేకాక, ప్రణవం స్వరూపాన్ని, నమశ్శబ్దం ఉపాయమైన ప్రపత్తిని తెలుపుతున్నది కావడంచేత, ఇక ఫలాన్ని తెలుపడమే పరిశేషన్యాయంలో మిగిలి ఉన్నది. అందుచేత "నారాయణాయ" అనేటప్పుడు "ఆయ" అనే ప్రత్యయం దాస్యస్వభావంచేత ఏర్పడే కైంకర్యాన్ని తెలుపుతున్నది–అని గ్రహించాలి. ఈ విధంగా మొదట రెండు చోట్ల ఉండే ప్రత్యయాలు

నేరుగా అర్థాన్ని తెలుపుతున్నాయని, తరువాత వేరు వేరు అర్థాలను తెలుపుతున్నాయి అని అనడంలో అర్థ వైరుధ్యం ఉన్నదని భావించరాదు. ప్రమాణాలను అనుసరించి వాక్యాన్ని ఒకటిగా, రెండుగా, మూడుగా విభజించి అర్థాలను చెప్పేటప్పుడు ఆయా క్రమానికి తగినట్లు విభక్తి ప్రత్యయాలకు వేరు వేరు అర్థాలను చెప్పడంలో ఏ విధమైన అర్థ వైరుధ్యం లేదని గ్రహించాలి.

**ద్వయార్థవివరణం:**

రహస్య త్రయంలో రెండవది అయిన ద్వయం ప్రథమ రహస్యమైన తిరుమంత్రంలోని అర్థాన్ని విశదీకరిస్తూ ఉన్నది. ఈ ద్వయం రెండు భాగాలతో కూడినది. భగవానుడు, లక్ష్మీదేవి మోక్ష సాధనకు ఉపాయం అవుతున్నారు. వారు ఇద్దరు కలసి ఉపాయంగా ఉండే స్థితిని ద్వయంలోని పూర్వ ఖండం తెలుపుతూ ఉండగా, వారిద్దరూ మోక్షంలో అనుభవింపబడే ఫలంమై ఉండే స్థితిని ఉత్తర ఖండం తెలుపుతున్నది.

**శ్రీ, నారాయణ పదాల అర్థంలో ఏ విరోధం లేదు:**

ద్వయంలోని రెండు వాక్యాలలో శ్రీ అనే పదం, నారాయణ అనే పదం ఉన్నాయి. ద్వయంలోని పూర్వ వాక్యానికి అర్థాన్ని చెప్పేటప్పుడు ఆ రెండు పదాలకు అర్థంగా కొన్ని గుణాలను, ఉత్తర ఖండానికి అర్థాన్ని చెప్పేటప్పుడు ఆ రెండిటియొక్క అర్థంగా మరికొన్ని గుణాలను చెప్పవలసి ఉన్నది. ఈ విధంగా ఒకే పదానికి రెండు ఖండాలలో వేరు వేరు గుణాలను అర్థంగా చెప్పడంలో అర్థ వైరుధ్యం ఉన్నదని భావించరాదు. ఇంతేకాక, ఒక ఖండంలో ఉండే పదానికి చెప్పే అర్థాలు, ఇంకొక భాగంలో ఉండే అదే పదానికి చెప్పే అర్థాలు సమానం కావనికూడా భావించాలి. 'శ్రీ' అనే పదం, 'నారాయణాయ' అనే పదం దివ్య

దంపతుల అన్ని గుణాలను తెలిపేవి అయితే, ఖండవిభాగాలను బట్టి ఒకే పదానికి అర్థభేదాన్ని ఏ విధంగా గ్రహించాలి? అని అడగవచ్చును. ఇందుకు తగిన సమాధానం ఏమంటే, భగవానునకు, లక్ష్మీదేవికి ఉండే గుణాలకు అంతులేదు. ఆ గుణాలను అన్నిటినీ అనుసంధించడానికి ఎవరికి సాధ్యం కాదు. ఆయా సందర్భాలలో ఆవశ్యకాలైన గుణాలను మాత్రం అనుసంధించడం సరి అయిన క్రమం. ఇక్కడ పూర్వ ఖండంలో దివ్యదంపతులు జీవుని విషయంలో మోక్షోపాయమై ఉంటారు– అని చెప్పడంచేత అందులో ఉండే 'శ్రీ', 'నారాయణ' పదాలు వారు ఉపాయం కావడానికి కావలసిన గుణాలను మాత్రం తెలుపుతాయి. జీవుడు శరణు పొంది వారిని ఉపాయంగా గ్రహించేటప్పుడు ఆ గుణాలను మాత్రం తప్పక అతడు అనుసంధించాలి. ఈ విధంగానే రెండవ వాక్యంలో జీవుని చేత దివ్య దంపతులు ఇద్దరు అనుభవింపబడే మోక్షఫలంగా చెప్పబడుతున్ననందున, అందులోని 'శ్రీ', 'నారాయణ' పదాలు వారి ప్రాప్యత్వరూపాలకనుగుణాలైన గుణాలను మాత్రం బోధిస్తాయి. జీవుడు వారిద్దరిని ఇద్దరిని మోక్షంలో అనుభవించే ప్రాప్యంగా గ్రహించేటప్పుడు ఆ గుణాలను మాత్రం అతడు ముఖ్యంగా అనుసంధించి వలసి ఉన్నది. ఈ విధంగా రెండు ఖండాలలో ఆయా సందర్భాలకు తగిన గుణాలను నిశ్చయించి బోధించడంకోసమే ఆ రెండు పదాలకు పూర్వ– ఉత్తరఖండ రూపవిభాగానుగుణంగా అర్థాలను వేరు వేరుగా చెప్పడం జరిగింది –అని గ్రహించాలి. ఇంతేకాక, లక్ష్మీదేవి జీవునికోసం భగవానునివద్ద పురుషకారం చేస్తుంది కనుక, పూర్వ వాక్యంలోని శ్రీ శబ్దంలో లక్ష్మీపురుషకారానికి కావలసిన గుణాలను అనుసంధించవలసి ఉన్నదని కూడా తెలియాలి. ఈ రెండు దశలలో అనుసంధించ వలసిన గుణాలనుగూర్చిన వివరణం 'రహస్య త్రయసారం' ద్వయాధికారంలో అనుసంధించాలి.

**ఫలానికి సిద్ధ–సాధ్యోపాయాలు రెండు ఆవశ్యకాలే:**

"చరణౌ శరణం ప్రపద్యే" అని అనడంచేత భగవంతుని చరణాలను ఉపాయంగా పొందుతున్నాను అనే అర్థం వ్యక్తమవుతోంది. దీనివల్ల భగవంతుని శ్రీ చరణాలు ఉపాయం–అని తెలుస్తున్నది. చరమ శ్లోకంలో "మామ్ ఏకం శరణంవ్రజ" అని "నన్ను ఉపాయంగా ఆశ్రయించు" అని శ్రీకృష్ణుడు అన్నాడు. అప్పుడు భగవానుడు ఉపాయమా? లేక, అతని చరణాలు ఉపాయమా? అనే ప్రశ్న కల్గుతుంది. ఈ రెండు వాక్యాలు ప్రమాణాలు కనుక, భగవంతుని శ్రీ పాదాలు, అతడు–అనే రెండు ఉపాయాలు అని చెప్పాలి. అందువల్ల సిద్ధోపాయం ఒకటే అనే సిద్ధాంతాన్ని మార్చి, రెండు సిద్ధోపాయాలు ఉన్నాయని చెప్పవలసి వస్తుంది. అంతేకాక, ద్వయ మంత్రం భగవంతుని శ్రీచరణాలు ఉపాయమని తెలుపుతున్నందున భక్తి ప్రపత్తులు అనేవి మోక్షానికి ఉపాయాలు కావుకదా–అని స్పష్టపడుతుంది.

ఈ ప్రశ్నలకు సమాధానాన్ని ఈ విధంగా చెప్పుకోవచ్చు. ఇక్కడ భగవంతుని పాదాలు "చరణౌ" అనే పదం ఆ పాదాలను అంగంగా కల భగవంతుని దివ్యమంగళరూపాన్ని తెలుపుతుంది. ఇంతటితో ఆగకుండా, ఆ రూపాన్ని కల భగవానుని కూడా సూచిస్తుంది. దీనికి ఔపచారిక ప్రయోగం– అని పేరు. జీవుడు ఆచరించే ఉపాయానికి వశం అయ్యేవాడు భగవంతుడే కదా. అందుచేత భగవంతుడు ఒక్కడే సిద్ధోపాయం–అనే సిద్ధాంతానికి ఎటువంటి భంగం లేదు.

భక్తి ప్రపత్తులు ఉపాయాలు అయే అవకాశం లేదు. ఎందుకంటే– ఉపాయమనేది సిద్ధ–సాధ్యరూపంలో రెండు విధాలు. జీవునిచే అనుష్ఠింపబడవలసిన ఆవశ్యకత లేనట్లు సిద్ధోపాయరూపుడైన భగవంతుడు సిద్ధోపాయం అవుతున్నాడు. జీవునిచే ఆచరింపబడవలసిన భక్తి ప్రపత్తులు సాధ్యో ఉపాయాలు. ఈ భక్తి ప్రపత్తులతో జీవుడు చేసిన పాపకర్మలవలన భగవంతునకు

కలిగిన కోపం ఉపశమించి, అతనికి వశుడై, ఫలాన్ని ఇస్తాడు. అందువల్ల కూడా భక్తిప్రపత్తులు మిక్కిలి ఆవశ్యకం. కనుక, వీనిని కాదనడానికి వీలు లేనిదవి – అని కూడా గ్రహించాలి.

**నమశ్శబ్దానికి పలు అర్థాలను చెప్పడంలో క్లేశం ఏమీ లేదు:**

"నమః" అనే పదం అష్టాక్షరి అనబడే తిరుమంత్రం నడుమ ఉన్నది. ఈ పదమే రెండవ రహస్యమైన ద్వయంలో చివరి పదంగా ఉన్నది. అయితే, అష్టాక్షరి మధ్యలో ఉండే నమశ్శబ్దానికి, ద్వయంలో చివరలో ఉండే నమశ్శబ్దానికి అర్థాలు వేరు వేరుగా చెప్పబడుతున్నాయి. తిరుమంత్రంలోని నమః అనే పదానికి జీవుని స్వాతంత్ర్య రాహిత్యం, అనిష్ట నివారణం, ప్రపత్తి మొదలైన అర్థాలు చెప్పబడుతున్నాయి. ద్వయమంత్రంలోని నమ శ్శబ్దానికి అహంకారమమకారరాహిత్యం, కర్తృత్వ భోక్తృత్వాలు నివర్తించడం మొదలైన పలు అర్థాలు చెప్పబడుతున్నాయి. ఈ విధంగా ఒకే పదానికి ఒక చోట ఒక అర్థం,ఇంకొక చోట ఇంకొక అర్థం తెలుపడం ఏ విధంగా పొసగుతుంది? అనే ప్రశ్న కలుగవచ్చు. దానికి సమాధానం ఈ విధంగా చెప్పవచ్చు. అహిర్బుధ్న్యసంహిత మొదలైన గ్రంథాలలో "నమః "అనే పదానికి పలు అర్థాలు చెప్పబడ్డాయి. తిరుమంత్రంలో, ద్వయంలో ఉండే వాక్యాలను వేరు వేరు విధాలుగా అన్వయించి అర్థాలు చెప్పబడుతున్నాయి. ఆయా రీతులలోని వాక్యాలకు అర్థాలను తెలిపేటపుడు వాటికి తగినట్లు "నమః" అనే పదానికి వేరు వేరు అర్థాలను తెలుపడంలో ఏమి విరోధం ఉన్నది? అందువల్ల "నమః" అనే పదానికి సందర్భాన్ని అనుసరించి వేరు వేరు అర్థాలను గ్రహించడంలో దోషం ఏమీ లేదు–అని తెలుస్తున్నది.

**భగవానుడు ఉపాయం అనేదానికి ప్రపత్తి అక్కరలేదని అర్థం కాదు:**

శరణం అనే పదం రెండవ రహస్యమైన ద్వయంలో, మూడవ రహస్యమైన చరమ శ్లోకంలో ఉన్నది. శరణమనే పదానికి ఇల్లు, ఉపాయం, శరణం మొదలైన అర్థాలున్నాయి. "శరణం గృహ రక్షిత్రోః ఉపాయే" అని నిఘంటువు. అయినా, ఇక్కడ ఈ పదం 'ఉపాయం' అనే అర్థంలో ప్రయోగింపబడినది. అందువల్ల ఆ అర్థాన్నే ఇక్కడ గ్రహించాలి. దీనిని ఆధారంగా చేసుకొని ఇక్కడ కొంతమంది ఒక ప్రశ్నను లేవదీశారు. ద్వయంలో, చరమ శ్లోకంలో శరణ శబ్దం భగవంతుని ఉపాయంగా తెలుపుతున్నది. అందువల్ల ఆ భగవానుడు తప్ప ప్రపత్తి అనేది అతనిని పొందడానికి ఆవశ్యకమైన ఉపాయం కాదు–అని కొందరు అభిప్రాయపడ్డారు. దీనికి సమాధానం ఏమంటే–వారి వాదం ఒక అతివాదమే అనాలి. అంటే–ఉన్నదానిని అతిశయంగా చెప్పడమే. దానిని కూడా కొంచెం సేపు అంగీకరించి చూద్దాం. వారి దృష్టిలో కూడా ప్రపత్తి చేయవద్దనే అభిప్రాయం లేదు. ప్రపత్తిని చేసేవానికి ఫలాన్ని ఇవ్వాలని అనుగ్రహించాలని సంకల్పించి, ఆ ఫలాన్ని ఇచ్చేవాడు భగవంతుడే. అందువల్ల సిద్ధోరూపుడైన అతడే మిక్కిలి ముఖ్యమైన ఉపాయం–అనే అభిప్రాయంతో ప్రపత్తి ఉపాయం కాదు–అని వారన్నారు. భగవంతుడు ఉపాయం అయినందున అతడే ముఖ్యమైన ఉపాయం అనే ఈ విషయాన్ని మేము మేము కూడా అంగీకరిస్తాము. భగవంతుని కోపాన్ని ఉపశమింప జేసి ఫలాన్ని అతడు ఇచ్చేటట్లు చేసే సాధ్యోపాయం అయిన ప్రపత్తిని అతనికి తరువాత ఉపాయమనే మేము పలుకుతున్నాము. లోకంలో ఇద్దరు కలిసి చేసిన పనిలో, ఒకడు అధికమైన భాగాన్ని చేస్తే "అతడే ఆ పనిని పూర్తిగా చేశాడు, మిగిలినవాడు నామమాత్రమే"–అని అంటాము కదా! ఆ విధంగానే వారు "భగవానుడే ఉపాయం,ప్రపత్తి ఉపాయం కాదు" అని

అంటున్నారని భావిస్తాము. ఆ విధంగా కాకుండా నిజానికి ప్రపత్తిని చేయవలసిన అవసరమే లేదు–అనే అభిప్రాయంతో వారు అంటే, దానిని మేము అంగీకరించము. సాధ్యోపాయమైన ప్రతిపత్తిని చేయకపోతే భగవానుని సిద్ధోపాయస్వభావం కొంచెం కూడా ఫలించదు. నిష్ఫలమే అవుతుంది. మోక్షాన్ని అతడు ఇవ్వలేడుకూడా. అందుచేత ప్రపత్తి పూర్తిగా అక్కరలేదు–అని అనడం ఏ విధంగానూ పొసగదు–అనే విషయాన్ని ఇంతకుముందే పూర్వాచార్యులు సుస్థాపించారు.

**"ప్రపద్యే "అనేటప్పుడు వర్తమాన కాలిక ప్రత్యయం ప్రపత్తిని చేసే కాలానికి సూచకం:**

ద్వయంలో "ప్రపద్యే" అనేది క్రియా రూపం. ఇది వర్తమాన కాలాన్ని సూచిస్తుంది. (శరణంగా) పొందుతున్నాను–అనేది దీని అర్థం. ఈ క్రియారూపం వర్తమాన కాలంలోనే ఎందుకు ఉండాలి? అని అంటే, జీవుడు ద్వయాన్ని సాధనంగా గ్రహించి, ప్రపత్తిని చేసేటప్పుడు ఈ విధంగా అనుసంధానం చేయాలి కనుక, ప్రపత్తి చేసే కాలం వర్తమాన కాలం కనుక, క్రియావిభక్తి వర్తమాన కాలంలో ఉన్నదని గ్రహించాలి.

**ప్రపత్తిని ఒకమారు చేయడం విధి:**

ఇక్కడ ఇంకొక సందేహం. "ప్రపద్యే" పొందుతున్నాను–అని వర్తమానకాలంలో చెప్పడం వల్ల నిరంతరం ప్రపత్తిని చేయాలి–అని తోస్తున్నదే! అనేది ఆ సందేహం. దీనికి ఈ విధంగా సమాధానాన్ని చెప్పుకోవాలి. ఆ విధంగా నిరంతరం ప్రపత్తిని చేయాలి–అని భావించడం సరికాదు. "శరణు పొందుతున్నాను"–అనే అర్థాన్ని ఇచ్చే "ప్రపద్యే" అనే క్రియారూపం ప్రపత్తిని చేసేవాడు అనుసంధించ వలసిన క్రమాన్ని తెలుపుతున్నది. ఈ శబ్దంలో "ప్రపత్తిని సదా చేయాలి" అనే అర్థాన్ని తెలిపే చిహ్నం

ఏది లేదు. చరమ శ్లోకంలో "శరణం వ్రజ" అని భగవంతుడు విధించాడు కదా. ఆ విధిని తెలిపే "వ్రజ" అనే మధ్యమ పురుష క్రియాపదంలో నిరంతరం ప్రపత్తిని చేయాలి–అని తెలిపే గుర్తు ఏదైనా ఉన్నదా? లేదు కదా.! దానికి విరుద్ధంగా ఒకసారి చేయాలి, ఇంకొక మారు చేయకూడదు–అనేదానికి చాలా ప్రమాణాలు ఉన్నాయి. అందువల్ల "ప్రపద్యే" అనే వర్తమాన కాలికమైన రూపం ప్రపత్తిని చేసే కాలాన్ని మాత్రమే తెలుపుతుంది.

**యావజ్జీవం ప్రపత్తిని చేయాలి అని పలికేవారి సూక్తిని సమన్వయించే రీతి:**

కొందరు ఆజీవితం ప్రపత్తిని నిరంతరం చేస్తూనే ఉండాలి– అని అంటారు. ఇది పొసగని మాట. అయినా, వారి మనసులోని అభిప్రాయాన్ని అనుకూలమైన రీతిలో ఊహించి, పలికే మాటను కూడా సమన్వయం చేయవచ్చు. ఏ విధంగా? అంటే, మోక్షాన్ని పొందడానికి ఉపాయంగా జీవుడు ఆచరించే ప్రపత్తిని అతడు ఒకేసారి చేయాలి. శరణాగతి చేసిన తర్వాత శరీరపతనం వరకు అతడు ఇక్కడ ఉండే కాలంలో ఆనందంగా కాలాన్ని గడపాలి కదా. అందుకోసం అతడు ద్వయమంత్రాన్ని అనుసంధిస్తూ, భగవంతుని శ్రీ చరణాలను తాను శరణాగతి చేసిన విషయాన్ని స్మరిస్తూ, ఆనందంగా కాలాన్ని గడపాలి–అనే అభిప్రాయంతోనే వారు జీవితాంతం శరణాగతిని వేయాలి–అని అంటున్నారని చెప్పాలి. ఇది మనకు కూడా అంగీకార్యమే కదా! గద్యలో కూడా భగవద్రామానుజులు మొదట ప్రపత్తిని చేయడాన్ని తెలిపి, తరువాత "ద్వయమర్థానుసంధానేన సహ సదైవం వక్తా" ఇత్యాదిగా శరీరం పతనం అయ్యేటప్పుడు లభించే ముక్తిని గూర్చి సందేహాన్ని విడచిపెట్టి, విడిచి ఆనందంగా ఉండమని నియమిస్తూ, యావజ్జీవం కర్మలను ఆచరించే సమయంలో తప్ప మిగిలిన సమయాలలో ద్వయ మంత్రాన్ని, దాని అర్థాన్ని

అనుసంధిస్తూ, సుఖంగా కాలాన్ని గడపమని నియమించారు. ద్వయార్థమే కదా ప్రపత్తి. అందువల్ల కొందరు పలికే మాటను మంచి అర్థంలో సమన్వయం చేసి, మేము తెలిపి అర్థంలో విరోధం ఏమీ లేకుండా ఉండేటట్లు చేశాము. శరణాగతి తరువాత చేసే ద్వయానుసంధానం కానీ, ప్రపత్తి కానీ, మోక్షోపాయకోటిలోనికి అన్వయించవు. ఆనందంగా కాలాన్ని గడపడంలోనే చేరుతాయి.

## ప్రపత్తికి చెప్పబడిన అంగాలలో కొన్ని అక్కరలేదు అని అనడంలోని అభిప్రాయం:

ప్రపత్తికి – అనుకూల్య సంకల్పం, ప్రాతికూల్యవర్జనం, కార్పణ్యం, మహావిశ్వాసం, గోప్తృత్వవరణం – అనే అయిదు అంగాలు ఉన్నాయి–అని శాస్త్రాలు తెలుపుతున్నాయి. "న్యాసః పంచాంగసంయుతః "అని లక్ష్మీతంత్రం తెలిపింది. శరణాగతి ఉపాయంగా స్వీకరించేవారిలోనే కొందరు ఈ అంగాలలో కొన్నిటిని తిరస్కరించారు. ఉదాహరణకు–కొందరు "అనుకూల్య సంకల్పం మొదలైనవి ఉంటే ఉండనివ్వండి, లేకపోతే లేక పోనివ్వండి, అవి లేకపోయినా లోటు లేదు, తప్పక ఉండాలి అనే నియమం లేదు" అని అన్నారు. మరి కొన్ని వచనాలు ప్రపత్తికి ముఖ్యమైన అంగం అయిన మహా విశ్వాసం లేకపోయినా ప్రపత్తిని చేయవచ్చు అని తెలుపుతున్నాయి. దీనివల్ల ఈ అంగాలు అక్కరలేదని అనరాదు. అంగి అయిన శరణాగతికి కల గౌరవాన్ని తెలుపడంకోసమే ఆ అంగాలను గురించి ఆ విధంగా అన్నారని భావించాలి. దీనిని బట్టి చేసే ప్రపత్తిలో కొన్ని అంగాలు తక్కువగా ఉన్నా భగవంతుడు తన కరుణతో ఆ అంగాలను కాలక్రమంలో పూర్తి చేసి, తాను కూడా పూర్ణుడై ఫలాన్ని ఇస్తాడు – అని శరణాగతిలోని మహిమను తెలుపడంలో దృష్టి పెట్టి, దానికి అనుగుణంగా ఈ విధంగా చెప్పబడినవి అని గ్రహించాలి.

### అన్ని అంగాలనే ప్రపత్తి అని అనడంలోనే తాత్పర్యం:

ఈ విధంగా అనుకూల్యసంకల్పం మొదలైన 5 అంగాలు శరణాగతికి అవసరం. అయితే, మరి కొన్ని ప్రమాణాలు కొన్ని అంగాలను మాత్రం ప్రధానంగా పలుకుతూ, వానిని కూడా అంగి అయిన ప్రపత్తి అని అనడంలోనే భావం ఏమి? ఉదాహరణకు– ఒక ప్రమాణం మహావిశ్వాసాన్ని గురించి తెలుపుతూ "అదే ద్వయార్థమైన శరణాగతి" – అని అన్నది. ఇంకొకటి "మహా విశ్వాసంతో ఫలాన్ని ఇచ్చేటట్లు ప్రార్థించడం అనే గోప్తృత్వరణమే ప్రపత్తి"– అని అన్నది. ఈ విధంగా ఈ రెండు అంగాలను గొప్పగా చేసి పలుకుతూ, వానిని ప్రపత్తిగా పలకడంలో ఏమి భావం? అనే సందేహం ఇక్కడ కలుగుతుంది. దీనికి సమాధానం ఏమంటే –ప్రపత్తికి కల అయిదు అంగాలలోమహా విశ్వాసం అనేది చాలా ముఖ్యమైన అంగం. ఈ మహా విశ్వాసం లేకపోతే శరణాగతి ఫలించదు కదా. ఈ విధంగానే గోప్తృత్వ వరణం అనే అంగం కూడా చాలా ముఖ్యమైనది. భగవంతుడు సర్వజ్ఞుడు, కరుణామయుడు అయినా, జీవుడు తనను రక్షించమని చేసే ప్రార్థన కోసం ఎదురు చూస్తాడు – అనే విషయాన్ని "సర్వజ్ఞోపి హి సర్వేశః సదా కారుణికోపి సన్, సంసారతంత్రవాహిత్వాత్ రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే" ఇత్యాది ప్రమాణాలు తెలుపుతున్నాయి. ఈ విధంగా ప్రార్థించడం అనేది గోప్తృత్వవరణం అనే అంగం. ఇది కూడా ముఖ్యమైనది. అందువల్ల ఈ రెండు అంగాలు మిగిలిన అంగాలకంటే చాలా ముఖ్యమై ఉండడాన్నిబట్టి వీటిని పొగడడం కోసం ఆ విధంగా గొప్పగా చెప్పబడ్డాయి – అని భావించాలి.

### ప్రపత్తికి కల రెండు రూపాలు –అంగిత్వం,అంగత్వం:

శ్రీకృష్ణుడు భగవద్గీతలోని చరమ శ్లోకంలో "మామేకం శరణం వ్రజ" – నన్ను ఒక్కని మాత్రమే శరణు పొందు – అని శరణాగతిని విధించాడు. ఈ ప్రపత్తికి రెండు రూపాలు ఉన్నాయి

అంగమై ఉండడం, స్వతంత్ర మై ఉండడం –అనేవి ఈ రెండు రూపాలు. భక్తి యోగానికి చేసే ప్రపత్తి అంగ ప్రపత్తి. ముక్తికి సాక్షాత్ ఉపాయంగా చేసే ప్రపత్తి స్వతంత్ర ప్రపత్తి –అంగిప్రపత్తి అనబడుతుంది.

**శ్రీ గీతా భాష్య– గద్యలమధ్య పరస్పరం వైరుధ్యం లేదు:**

శ్రీభాష్య కారులు గీతాభాష్యంలో చరమశ్లోకానికి భాష్యాన్ని ప్రసాదించేటప్పుడు భక్తియోగానికి అంగంగా ప్రపత్తిని వివరించారు. శరణాగతి గద్యలో ఈ శ్లోకంయొక్క గొప్పతనాన్ని పలికేటప్పుడు మోక్షానికి సాక్షాత్ ఉపాయంగా అంగి ప్రపత్తిని తెలుపుతున్నట్లు వివరించారు. ఈ విధంగా ఒకరే వ్రాసిన రెండు గ్రంథాలలో ఒకే శ్లోకానికి అర్థం పలకడంలో తేడా కనబడుతున్నదే–అని అడగవచ్చు. వాస్తవానికి ఇక్కడ ఏ విధమైన విరోధం లేదు. భక్తియోగం అన్ని ప్రయోజనాలను ఇవ్వగలిగినది అయినట్లే శరణాగతి కూడా అన్ని ప్రయోజనాలను ఇవ్వగలిగినది. భక్తి యోగాన్ని చేసేటప్పుడు దానిని పూర్తి చేయడానికి వీలుకానట్లుగా కొన్ని పాపాలు అడ్డుపడవచ్చు. ఆ పాపాలు ఇక మిగిలిన ఏ విధమైన ప్రాయశ్చిత్తం ద్వారా తీర్చుకోవడానికి సాధ్యం కాకుండా ఉన్నప్పుడు, వాటిని పోగొట్టుకోవడంకోసం శరణాగతిని చేస్తే, భక్తి యోగానికి అంగంగా చేయడంవల్ల అది ‘అంగ ప్రపత్తి’ అనబడుతున్నది. అర్జునుడు భక్తి యోగాన్ని చేసే యోగ్యతను కలవాడు. కనుక దానికి అనుగుణంగా అక్కడ అంగ ప్రపత్తి చెప్పబడిందని గీతాభాష్యం లో వివరింపబడింది. ఇక, గద్యలో అయితే ప్రపత్తి మోక్షం మొదలైన అన్ని ప్రయోజనాలను ఇవ్వగలిగిన శక్తిని కలిగి ఉన్నదనే దాని వైలక్షణ్యం తెలుపబడుతున్నది. అందుచేత అక్కడ అంగిగానే తప్ప అంగంగా తెలిపే సందర్భం లేదు. అందువల్ల ఇక్కడ ఏ విధమైన అర్థవైరుధ్యం లేదు – అని గ్రహించాలి.

**"సర్వ ధర్మాన్" అనే పదంలోని రెండు అర్థాలు:**

చరమశ్లోకంలోని పూర్వార్ధం "సకల ధర్మాలను విడిచిపెట్టి నన్ను మాత్రమే శరణు పొందు" అనే అర్థాన్ని తెలుపుతున్నది. ఇక్కడ "సర్వధర్మాన్" అనే పదం అన్ని ధర్మాలను తెలుపగలిగినదే అయినా, ఆ సందర్భానికి తగినట్లు సర్వశబ్దంలోని అర్థాన్ని సంకోచింపజేసి, ధర్మా లను సంకోచింపజేసి కొందరు అర్థాన్ని తెలుపుతున్నారు. అంటే– మోక్షానికి సాక్షాత్ ఉపాయం అయిన భక్తియోగం దాని అంగాలు అయిన కర్మయోగం, జ్ఞానయోగం అనేవి మాత్రం సర్వ ధర్మశబ్దానికి అర్థంగా గ్రహించి వీటిని విడిచిపెట్టి నీవు నన్ను మాత్రమే శరణంగా ఆశ్రయించు – అని విధిస్తున్నదని వారి అభిప్రాయం. ఇది సర్వ శబ్దం లోని అర్థాన్ని సంతోషింప జేసి చెప్పే క్రమం. ఈ క్రమం మన సిద్ధాంతానుసారం అంగీకరించతగినదే. ఇంకా కొందరు సర్వశబ్దంలోని అర్థాన్ని సంకోచింప జేయకుండా,ముందు తెలిపిన భక్తియోగం, దాని అంగాలైన కర్మయోగజ్ఞానయోగాలు, వీనితో పాటు వర్ణాశ్రమధర్మాలైన నిత్య నైమిత్తికాదిసకల ధర్మా లను విడచి నన్ను శరణ పొందు – అనే అర్థాన్ని తెలుపుతున్నదని అంటున్నారు. ఇది సర్వశబ్దం లోని అర్థాన్ని సంకోచింప జేయకుండా చెప్పే క్రమం. పైపైన గమనిస్తే ఈ రెండు అర్థాలు ఒకదానితో ఇంకొకటి విరుద్ధంగా ఉన్నట్లు తోస్తాయి. నిజానికి ఇక్కడ విరోధం ఏమీ లేదు. ఏ విధంగా? అంటే, – పూర్వార్ధంలో తనకు తగనిది అయిన భక్తి యోగాన్ని, దాని అంగాలను విడచిపెట్టినవానిని చూచి, భగవంతుడు తనను శరణు పొందమని విధించాడని చెప్పాలి. ఇక్కడ ఈ విధంగా అనడంలో ఏ విధమైన కష్టం లేదు కదా. ఇక, రెండవ అర్థంలో వర్ణాశ్రమ ధర్మాలను కూడా చేర్చి, వాటిని కూడా విడిచిపెట్టి, నన్ను మాత్రమే శరణు పొందు–అని విధించినట్లు చెప్పాలి. ఈ విధంగా అర్థం

చెప్పడంలో కూడా ఏ విధమైన కష్టం లేదు కదా. ఎందుకంటే–ఈ ధర్మా లను అన్నిటిని ప్రపత్తికి అంగం అనే భావనతో చేయడం విడిచిపెట్టు – అనేది ఇక్కడ సారమైన అర్థం. ఇందులో ఏమి కష్టం ఉన్నది? తనకు గల అయిదు అంగాలను తప్ప ప్రపత్తి ఇక దేనిని కోరదు– అనే విషయాన్ని మనం కూడా అంగీకరించాము కదా. అందుచేత ఈ రెండు విధాలైన అర్థాలలో ఏ విరోధం లేదు. ఇక్కడ రెండవ అర్థాన్ని పలికేవారుకూడా వర్ణాశ్రమ ధర్మా లను చేయకుండా విడిచిపెట్టాలని అనలేదు కదా! ప్రపత్తికి వానిని అంగాలుగా గ్రహించి చేయరాదు–అని కదా వారి అభిప్రాయం. ఇది మనకు కూడా సమ్మతమే. అన్యమతస్థులు వర్ణాశ్రమ ధర్మాలను ఆచరించ కుండా విడిచిపెట్టి, ప్రపత్తిని మాత్రం చేయమని విధించినట్లు అంటారు. వారి వాదంలోనే స్వతంత్రుడైన భగవానుని అజ్ఞను శాస్త్రానుసారంగా ఆచరించని దోషం వస్తుంది. శరణాగతికి అంగం అనే అభిప్రాయాన్ని విడచిపెట్టి, వర్ణాశ్రమ ధర్మా లను భగవంతుని కైంకర్యం అనే భావనతో చేసి తీరాలి–అనే వాదంలో శాస్త్రాన్ని మీరడం అనే దోషానికి స్థానం లేదు.

**"పరిత్యజ్య", "ఏకమ్" అని పదాలకు చెప్పే పలు అర్థాలు ప్రామాణికాలు:**

చరమ శ్లోకంలో ఉండే "పరిత్యజ్య", "ఏకమ్" అనే రెండు పదాలకు ఒక్కొక్క దానికి ఆరు అర్థాలు చెప్పబడ్డాయి. ఈ ఆరు అర్థాలు మూల ప్రమాణానుసారంగా చెప్పబడ్డాయి. అందువల్ల, ఎందుకు ఇన్ని అర్థాలు చెప్పబడ్డాయి? అనే ప్రశ్నకు చోటు లేదు. పైపైన చూచినప్పుడు ఈ అర్థాల మధ్య పరస్పర విరోధం ఉన్నట్లు తోచవచ్చు. కానీ ప్రమాణాల ద్వారా ఒక పదానికి చెప్పే అనేక అర్థాలలో ఒకదానితో ఇంకొక దానికి విరోధం ఉందని చెప్పడం వీలు కాదు.

**"పరిత్యజ్య", "ఏకమ్" అనే పదాలకు చెప్పే పలు అర్థాలలో పునరుక్తి దోషం లేదు:**

అయితే, "పరిత్యజ్య" అనే పదానికి చెప్పే ఆరు అర్థాలలో ఒకటి, రెండు అర్థాలు "ఏకమ్" అనే పదానికి చెప్పే ఆరు అర్థాలలో ఇమిడి ఉన్నవి. దీనిని బట్టి, చెప్పిన అర్థాన్ని చెప్పడం అనే పునరుక్తి దోషం ఉంది–అని అనరాదు. "పరిత్యజ్య" అనే పదానికి ఒక అర్థాన్ని చెప్పేటప్పుడు అదే అర్థం "ఏకమ్" అనే శబ్దానికి కూడా ఉన్నది–అనే విషయాన్ని విడచిపెట్టి మిగిలిన అర్థాలు అనుసంధానించాలి. ఈ విధంగానే "ఏకమ్" అనే పదానికి ఒక అర్థాన్ని చెప్పేటప్పుడు "పరిత్యజ్య" అని పదానికి అదే అర్థం ఉండడాన్ని విడిచి పెట్టి, దానికి చెప్పబడిన మిగిలిన అర్థాలను అనుసంధించాలి. ఈ విధంగా మార్చి మార్చి అనుసంధిస్తే చెప్పినదే చెప్పడం–అనే పునరుక్తి దోషం ప్రవర్తించదు.

**మామ్ అహం అనే పదాలలోని పరత్వ సౌలభ్యాలు:**

చరమశ్లోకంలో ఉండే "మామ్" అనే పదం, "అహం "అనే పదం రక్షకుడైన భగవంతుని తెలుపుతున్నాయి. "మామ్" అనే పదం రక్షకుడైన భగవంతుడు శరణాగతికి లక్ష్యమై ఉండే స్థితిని తెలుపుతున్నది. "అహం" అనే పదం అతడు అన్ని పాపాలనుండి విడిపించ గలిగిన శక్తిని కలవాడని తెలుపుతున్నది. ఇక్కడ "మామ్" అని అనడంవల్ల భగవంతుని సౌలభ్యగుణం వ్యక్తమవుతున్నది. జీవుడు భరన్యాసాన్ని చేసేటప్పుడు అతడు సమర్పించే రక్షణభారాన్ని అంగీకరించడానికి భగవానుడు సులభుడై ఉండే స్వభావం కదా ఉపయోగపడుతుంది. ఆ విధంగానే, "అహం" అనేటప్పుడు భగవంతుని పరత్వం వ్యక్తమవుతున్నది. అతడు జీవునకు ఎటువంటి సహాయాన్ని అయినా చేయడానికి అతని పరత్వంకదా ఉపయోగపడుతుంది.

ఈ విధంగా ఇక్కడ ఈ రెండు స్వభావాలను "మామ్, అహమ్" అనే రెండు పదాలద్వారా అనుసంధించడం ఎందుకు? అంటే, ఆయా కృత్యాలకు అవసరమైన స్వభావాలను ఆయా పదాలలో అనుసంధించడం తగినది అనే క్రమంలో ఈ విధంగా చెప్పబడింది. దీనినిబట్టి "మామ్" అనే పదంలో సౌలభ్యాన్ని భావించేటపుడు పరత్వం లేదు – అని కానీ, "అహం" అనే పదంలో పరత్వాన్ని అనుసంధించేటప్పుడు సౌలభ్యం లేదని కానీ భావించరాదు.

**"వ్రజ, త్వా" అని పదాలలోని ఏకవచనం సామాన్యంగా అందరిని తెలుపుతుంది:**

చరమశ్లోకంలో అర్జునుని మాత్రమే ఉద్దేశించి "వ్రజ " అని, "త్వా" అని ఏక వచనంలో శ్రీకృష్ణుడు పలికాడు. అందువల్ల ఇక్కడ విధింపబడిన శరణాగతి అర్జునుని మాత్రమే ఉద్దేశించి విధింపబడినది తప్ప, ఇతరులకు సంబంధించినది కాదు – అనే ప్రశ్న కలుగవచ్చు. దీనికి సమాధానం ఏమంటే, అర్జునుడు ఒక్కడే విషాదాన్ని పొంది శ్రీకృష్ణుని ఆశ్రయించి, శరణాగతి చేసి తనకు తగిన ఉపాయం ఉపదేశించమని అర్థించాడు. అందుచేత అతనిని ఉద్దేశించి గీతాచార్యుడు ఉపదేశం చేయవలసి వచ్చింది. భగవంతుడు సకలజీవులకు శరణం పొందడానికి తగినవాడని శాస్త్రాలు తెలుపుతున్నాయి. ఆ విధంగానే సకల జీవరాసులు శరణాగతి చేయవచ్చునని ప్రమాణాలు ఘోషిస్తూ ఉన్నాయి. లోకంలో తాను ప్రసవించిన దూడ కోసం ఆవు ఇచ్చే పాలు అందరికీ ఉపయోగపడతాయికదా! ఆ విధంగానే అర్జునుని ఉద్దేశించి తెలిపిన శరణాగతి దానిని అనుష్ఠించగల యోగ్యతను కలిగిన అందరికీ వర్తిస్తుంది – అని భావించాలి.

**"సర్వపాప" శబ్దానికి శాస్త్రవిరోధం లేని అర్థం:**

చరమశ్లోకంలోని ఉత్తరార్ధంలో "ప్రపత్తి చేసినవానిని అన్ని పాపాలనుండి వినిపిస్తాను"–అని శ్రీకృష్ణుడు అన్నాడు. ఇక్కడ కొందరు "సర్వపాప" శబ్దంలో శరణాగతి చేసిన తర్వాత తెలిసి చేసిన పాపాలుకూడా చేరుతాయి" అని, వాని నుండి విముక్తుని చేస్తానని శ్రీకృష్ణుడు అన్నాడని ఉంటారు. ఈ వాదం శాస్త్ర విరుద్ధం. వీరు పలికే రీతిలో ప్రపత్తికి తర్వాత తెలిసి చేసే పాపాలు కూడా ముందు చేసిన పాపాలవలె నశించడం సాధ్యమా? ఈ వాదం శరణాగతి తరువాత తెలిసి చేసే పాపాలకు ప్రాయశ్చిత్తం విధించే శాస్త్రవచనాలతో విరోధిస్తుంది. శరణాగతి చేసిన తరువాత చేసిన పాపాలుకూడా పూర్వం చేసిన శరణాగతివల్లనే తీరితే, ఇక ప్రాయశ్చిత్తాలను విధించడం ఎందుకు? అనే సందేహం కలుగుతుంది. దీనికి సమాధానం ఏమంటే – వారి వాదాలను శాస్త్రానుసారంగా సమన్వయించే వీలున్నది. "తెలిసి చేసే పాపాలను వానికి ప్రాయశ్చిత్తం చేస్తేనే నేను తీరుస్తాను" అని భగవానుని అభిప్రాయం. అందువల్ల ప్రపత్తికి తర్వాత బుద్ధిపూర్వకంగా చేసే పాపాలకు ప్రాయశ్చిత్తంగా ఏదైనా చేయడం ద్వారా గాని, ఆ విధంగా చేయకపోతే, లఘువైన దండన ఈ లోకంలోనే అనుభవించడం ద్వారా గాని ఆ పాపాలు తీరుతున్నాయి – అనే అభిప్రాయంతోనే బుద్ధిపూర్వకంగా శరణాగతి చేసిన తర్వాత చేసిన పాపాలను కూడా సర్వపాపశబ్దంలో చేర్చి పలికారు – అని చెప్పవచ్చు. అందుచేత, ఇక్కడ శాస్త్రవిరోధం లేదు.

**మోక్షాన్ని పొందే కాలం:**

చరమ శ్లోకంలో" అన్ని పాపాలననుండి నిన్ను విముక్తునిచేస్తాను" అని మాత్రం శ్రీకృష్ణుడు అన్నాడే కానీ, అతడు ఆ విధంగా సంకల్పించిన ఫలం ఎప్పుడు లభిస్తుంది? అనే

విషయాన్ని స్పష్టంగా తెలుపలేదు. కొందరు, ప్రపత్తిని చేయడానికి ముందు జీవుడు చేసిన పలు కర్మలు ఉంటాయి కదా! వాటిలో ఫలాన్ని ఇవ్వడానికి ప్రారంభించిన ప్రారబ్ధ కర్మలు ఎప్పుడు తీరిపోతాయో, అప్పుడే ముక్తి లభిస్తుంది. అది ఈ జన్మ చివరలో కానీ, మరు జన్మలో కాని కావచ్చు. ఎప్పుడు అనేది నిశ్చయంగా చెప్పలేము–అని అంటారు. మరికొందరు, జీవుడు శరణాగతిని చేసేటప్పుడు ఎప్పుడు ముక్తిని ఇవ్వాలలని ప్రార్థిస్తాడో, అప్పుడే మోక్షం సిద్ధిస్తుంది–అని అంటారు. ఈ రెండు వాదాలు పరస్పరం విరుద్ధాలుగా తోస్తాయి. కానీ వీటి మధ్య విరోధం ఏమీ లేదు. ఏ విధంగా? అంటే, సంసారం బంధం నుండి విడివడి, ముక్తిని పొందాలనే కోరికతో కదా జీవులు  ప్రపత్తిని చేస్తున్నారు. వీరిలో పలువురు ఈ శరీరం ఉన్నంతవరకు చేసిన కర్మఫలం అనుభవించ, ఈ శరీరం పతనం చెందినప్పుడు ముక్తిని పొందాలని భావిస్తారు. వీరు తిరిగి ఇంకొక శరీరాన్ని పరిగ్రహించి. అందులో కూడా కర్మఫలాలను అనుభవించాలని కోరడం లేదు. అందువల్ల ప్రారబ్ధ కర్మలను మాత్రం మిగిల్చి, అనంతరశరీరానికి అవసరమైన, మిగిలిన కర్మలను తీర్చుటలోనే వీరి ఉద్దేశ్యం. ఫలాన్ని ఇవ్వడం ప్రారంభించకుండా, సంచితాలై ఉండే కర్మలు అన్నీ తాము శరణాగతి చేసేటప్పుడే ఆ శరణాగతి ప్రభావంవల్ల పోతున్నాయి కదా! అందువల్ల వారు ప్రకృత శరీరం నిలిచి ఉన్నంత వరకు కర్మఫలాలను అనుభవించి, శరీరం పతనం చెందే సమయంలో కర్మలు నశించగా మోక్షాన్ని పొందుతారు. వీరికి ప్రారబ్ధ కర్మలలో ఒక భాగం శరణాగతి మహిమ వల్ల, ఇంకొక భాగం ఈ శరీరం ఉన్నంతవరకు వాటి ఫలాలను అనుభవించడం వల్ల తీరిపోతాయి.

ఇంకా కొందరు, మీ శరీరం ఉన్నంతవరకు కూడా ఈ లోకంలోని జీవనాన్ని సాగించడం సహించలేక, ఆ క్షణంలోనే మోక్షాన్ని పొంది, వైకుంఠాన్ని చేరి పరిపూర్ణమైన అనుభవాన్ని

పొందాలి అని అంతులేని ఆర్తితో శరణాగతిని చేస్తారు. దీనికి ఆర్తప్రపత్తి అని పేరు. వీరికి ఫలాన్ని ఇవ్వడం ఆరంభించిన కర్మలు ఆ సమయంలోనే నశించి, వెంటనే వీరు మోక్షాన్ని పొందుతారు. వీరికి ఆ క్షణంలోనే ప్రారబ్ధ కర్మలు నశించి పోవడానికి కారణం–వీరు చేసిన ఆర్తప్రపత్తిలోని మహిమయే.
అందువల్ల వీరంతా ప్రారబ్ధకర్మలు తీరిన తర్వాతనే మోక్షాన్ని పొందుతున్నారు. తాము కోరిన సమయంలోనే మోక్షాన్ని పొందినవారు అవుతున్నారు. వారి వారి సంసార బంధం తీరడానికి కాలంలో ని ముందు వెనుకలకు కారణం – వారి వారికి కల ఆర్తిలోని తారతమ్యమే. అందుచేత మొదట ప్రస్తావించిన విరోధం ఏమీ లేదని గ్రహించాలి.

**"మా శుచః" అనేటప్పుడు అర్జునుని శోకం ఏమిటి?:**

చరమశ్లోకం చివరలో "మా శుచః"–విచారించవద్దు–అని శ్రీకృష్ణుడుఅర్జునునకు ఉపదేశించాడు. దీనికి – చేయడంలో చాలా కష్టంగా ఉండేది, చిరకాలం చేయవలసినది, ఫలం చాలా కాలం తర్వాత ఇచ్చేది అయిన భక్తియోగాన్ని ఆచరించడానికి తనకు శక్తి లేకపోవడంవల్ల అర్జునుడు విషాదాన్ని పొందగా, ఆ విషాదాన్ని లేకుండా చేయడం కోసం చేయడంలో చాలా సులభమైనది, ఒకేసారి చేయవలసినది, త్వరగా ఇచ్చేది అయిన శరణాగతిని భగవానుడు ఉపదేశించి, "ఇక విచారించకు" అని ఓదార్చినట్లు వివరించబడుతున్నది కదా. గీత ఆరంభంలో యుద్ధభూమిలో శత్రువులు అందరూ తనచేత, తన బంధువులచేత వధింపబడే సందర్భాన్ని చూచి, అర్జునుడు విషాదాన్ని పొందాడని చెప్పబడింది కదా! విషాదాన్ని తీర్చడం కోసమే ఆ విధంగా "మా శుచః" అని భగవంతుడు పలికాడు– అని వివరించడం కదా యుక్తం. ఆ విధంగా కాకుండా, పూర్వం తెలిపిన రీతిలో వివరించడం ఏ రీతిలో పొసగుతుంది? అనే సందేహం

ఇక్కడ కలుగవచ్చు. దీనికి ఈ విధంగా సమాధానం చెప్పవచ్చు. ప్రారంభంలో యుద్ధరంగంలో బంధువులను మిత్రులను వధించవలసి రావడంచేత ఏర్పడిన శోకం తరువాత శ్రీకృష్ణుడు అనిత్యమైన శరీరాన్ని గురించి, ఆత్మ నిత్యతను గురించిన వివరాలను పలికినపుడే తీరిపోయింది. ఆ తర్వాత ఇంకొక శోకం అర్జునుని బాధించింది. అది ఏమంటే– ఆసుర స్వభావాన్ని కలిగి ఉండడంవల్ల కలిగే దోషాలను, దైవీస్వభావాన్ని కలిగి ఉండడంవల్ల కలిగే మంచిని శ్రీకృష్ణుడు వివరించినప్పుడు అర్జునునకు తాను ఆసుర ప్రకృతిని కలిగి ఉన్నానో ఏమో! అనే భయంతో శోకం కలిగింది. అప్పుడు కూడా శ్రీ కృష్ణుడు "మా శుచః సంపదం దైవీమభిజాతోసి పాండవ " అని అంటూ అతడు దైవీ ప్రకృతిని కలిగినవాడని తెలిపి, ఆ శోకాన్ని తీర్చాడు. ఆ విధంగానే మళ్ళీ శ్రీకృష్ణుడు అర్జునునకు భక్తి యోగాన్ని ఉపదేశించినపుడు కూడా దానిని తాను ఆచరించలేనేమో! అనే శోకం అతనికి కలిగినప్పుడు మళ్ళీ భగవంతుడు సులభోపాయమైన ప్రపత్తిని ఉపదేశించి, "మా శుచః" అని అతని శోకాన్ని పోగొట్టాడు – అని అనడమే ప్రకృతసందర్భానికి తగినది.

## ఉపసంహారం

ఇంతవరకు మన సంప్రదాయవిషయంలో, పూర్వాచార్య శ్రీసూక్తులలో, సిద్ధాంతంలో విరోధాలు కానీ, పూర్వాపర విరోధాలు కానీ ఎంత మాత్రం లేవు అని నిరూపింపబడినది. ఆ విధంగానే వేదాంత శాస్త్రంలో నిర్ణయింపబడిన తత్త్వ ఉపాయ పురుషార్థాలను గూర్చి మన సంప్రదాయంలో ఏ విధమైన పూర్వాపరాలు కాని, పరస్పర విరోధాలు కాని లేవని కూడా నిరూపింపబడినది. ఇటువంటి పరమపావనమైన, సనాతనమైన

సంప్రదాయం గురించి ఈ రహస్య గ్రంథంలో సంగ్రహంగా తెలుపబడింది . "సువ్యాహృతాని మహతాః సుకృతాని తతస్తతః, సంచిన్వన్ ధీర ఆసీత సిలహారీ సిలం యథా" అనే విధంగా క్షేత్రంలో రాలిన ధాన్యపు గింజలను ఏరుకొని, వానితో కేవలం జీవనం సాగించే వానివలె పెద్దల ఉపదేశాలను, వారి అనుష్ఠాన క్రమాన్ని అనుసరించి, వానిలో తనకు తగినవానిని స్వీకరించి తరించడం యుక్తం.

**కడలముదత్తై కడైన్దు శేర్ త్త**
**తిరుమాలడి కాట్టియ నమ్**
**దేశికర్ తన్నిలై ప్పత్తి చ్చేర్ న్దనమే**

పూర్వం భగవానుడు సముద్రాన్ని మథించి దేవతలకు అమృతాన్ని అనుగ్రహించాడు. ఆ అమృతం కంటే చాలా భోగ్యాలైన ఆ స్వామి శ్రీ చరణాలను మనకు ఉపాయంగా పూర్వాచార్యులు చూపించారు. అటువంటి వారి అనుష్ఠానాలను మిక్కిలి గొప్పవిగా తలచి, వానిలో అభినివేశాన్ని పొందుతాము.

**ఆసర్వజ్ఞాదస్మదాచార్యపంక్తేః**
**అప్రత్యూహం సత్పదం స్థాపయంతీ,**
**సైషా నిత్యం సంప్రదాయస్య శుద్ధిః**
**శ్రద్ధాతవ్యా చాతకన్యాయనిష్ఠైః.**

భగవంతుని దగ్గర నుండీ మన ఆచార్యుల వరకు ఎటువంటి అడ్డూ లేకుండా మంచి స్థానంలో సత్సంప్రదాయాన్ని నిలిపే ఈ సంప్రదాయ పరిశుద్ధి అనే గ్రంథాన్ని చాతక పక్షి న్యాయంతో (అంటే - చాతక పక్షులు వర్షపు చినుకుల కోసం ఎదురుచూచి అవి లభించినప్పుడు వాటిని గ్రహించి తమ

దాహాన్ని తీర్చుకునేటట్లుగా) ఆదరించి ఇందులో విషయాన్ని గ్రహించి తమ జిజ్ఞాసను తీర్చుకోవాలి.

**కవితార్కికసింహాయ కళ్యాణ గుణశాలినే,**
**శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః**

**సంప్రదాయపరిశుద్ధి ఆంధ్రానువాదం సంపూర్ణమ్**

